# అల్పజీవి

(నవల)

రచయిత

రాచకొండ విశ్వనాథశాస్త్రి



# అల్పజీవి

(నవల)

రచయిత:

రాచకొండ విశ్వనాథశాస్త్రి




ప్రకాశకులు:-

సౌరసాహితి

విశాఖపట్నం.

ఈ నాకృతి

అంకితం

ఆ నా సుందరికి.

హృదయమామెది కోమలం;

మనసామెది సుస్మితం;

తనువామెది సుకుమారం, సుందరం.

—విశ్వనాథశాస్త్రి.

ఈ నవల తొలి సారిగా ప్రచురించిన

"భారతి" సంపాదకులకు,

నా కృతజ్ఞత.

—రచయిత.

సంపాదకుడు

మ సూ నా

కాపీలు దొరకుచోటు

సౌరసాహితి

విశాఖపట్నం.

# అల్పజీవి

"సుబ్బయ్య సుందరుడు కాడు"

అది సుబ్బయ్య అభిప్రాయం.

"సుబ్బయ్య ఒట్టి చచ్చు పెద్దమ్మ"

అదీ సుబ్బయ్య అభిప్రాయమే.

'సుబ్బయ్యకి జమీందారీ లేదు.

అది అతని భార్య సావిత్రికి కోపకారణం.

"సుబ్బయ్య నంగిరిపింగిరిగాడు"

అని సావిత్రి అన్నగారయిన వెంకట్రావు అంటూవుంటాడు.

"నాన్న చాలా మంచివాడు"

సుబ్బయ్య పదిహేనుప్రాయం కమల అలా చెప్తుంది.

"నాన్నకి అమ్మనుచూస్తే భయం"

సుబ్బయ్యకొడుకు కృష్ణుడు కనిపెట్టిన విషయం అది.

"సుబ్బయ్యా ఈజ్ వెరీ ఇనెఫిషియన్ట్"

సుబ్బయ్యగురించి ఆఫీసులో హెడ్‌క్లార్కు "పాస్" చేసే "రిమార్కు" అది.

"సుబ్బయ్య పాపం ఒట్టి భయస్థుడు."

అది అనేకమంది అనేమాట.

సుబ్బయ్యకి సుమారు ముప్ఫయ్యయిదు సంవత్సరాల వయసుంటుంది. పొడవూ కాకుండా, పొట్టీ కాకుండా సన్నగా పల్చగా ఉంటాడు. అతని ముఖంలో ఏభాగమూ కూడా స్ఫుటంగా అవుపించదు; కాని, దేనికదిచూస్తే కన్నూ ముక్కూ నోరూ తీరుగానే ఉంటాయి. అతనిజుత్తు చాలా నల్లగా పొడవుగా ఉంటుంది. కొద్దిగా అతన్లో స్త్రీలలో ఉండే కోమలత్వం కన్పిస్తుంది.

సుబ్బయ్యకి అన్నీ భయాలే.

పులుసులో "ఉప్పు జాస్తీగా ఎందుకు వేసేవు?" అని ఇంట్లో సావిత్రిని అడగలేడతను. బైట బజార్లో కూరగాయల మనిషితో బేరం ఆడ్డానికి సంకోచిస్తాడు. అవసరంవచ్చినా ఆఫీసులో సెలవు అడగడానికతను అనుమానిస్తాడు. చేతిలో దమ్మిడీ లేకపోయినా అతను ఎవ్వర్నీ అప్పు అడగలేడు. వచ్చే నూటయాభైరూపాయిల జీతం ఎక్కడ నెల ముందుగా ఖర్చయిపోతుందో అని అతి జాగ్రత్తగా వాడుకుంటాడు.

సుబ్బయ్యకి "అధికారం" అంటే హడల్. పెద్దపెద్ద ఉద్యోగస్థులు, పోలీసులు వగైరాలతో సంబంధంలేకుండా కాలక్షేపం చేద్దామని అతని ఉద్దేశం. పెద్ద ఆఫీసుల్లో డవాలా బంట్రోతుల్ని సహితం అతను భయంతో చూస్తాడు.

చట్టాన్ని ఎన్నడూ అతిక్రమించిన పాపాన పోలేదు సుబ్బయ్య. ట్రెయిన్‌లో టిక్కెట్టు లేకుండా ప్రయాణంచేసేవార్ని చూసి సుబ్బయ్య చాలా ఆశ్చర్య పడతాడు. ఒక్కసారయినా అతను చిన్నతనంలో క్లాసులు ఎగ్గొట్టలేదు. సెలవు లేకుండా ఆఫీసుకి వెళ్ళడం ఎప్పుడూ మానెయ్యలేదు. సుబ్బయ్య, అనవసరంగా ఎవ్వరిజోలికీ పోడు. ఎవరితో అయినాసరే తగువంటే అతనికి తెగభయం. అందరితో మంచిగా ఉంటేనేగాని ఈ జీవితం

గడపటం కష్టమని అతని నమ్మకం. అందరితో మంచిగా ఉండాలనేది అతని ఆశయం. అందుచేత ఎవర్నైనా పలకరించేముందు అతను కొంచెం మందహాసం చేస్తాడు. అలా అతను చెయ్యడం పైవాళ్ళకి కొంచెం వెకిలిగా ఉన్నట్లు అవుపిస్తుంది.

సుబ్బయ్య తండ్రి పేరు సోమయ్య. అతనికి మొదటిభార్యవల్ల సుబ్బయ్య కలిగేడు. అతగాడికి ఏ ఉద్యోగమూ ఉండేదికాదు. ఉన్నకొద్దిపాటి భూమిమీదా ఏదోవస్తే అతడు దాన్తో కాలక్షేపం చేసేవాడు. ఆ భూములు అతను చనిపోకముందే పోయేయి. ఒక్కడే కొడుకు అవడంచేత సుబ్బయ్యని చాలా ముద్దుగా అతను పెంచేడు. తండ్రి నీడపట్టున పెరిగేడు సుబ్బయ్య.

సుబ్బయ్య తన తల్లిని ఎరగడు. ఆవిడ క్షయ వ్యాధివల్ల చనిపోయింది. తనతల్లి 'ఇలా ఉంటుంది' అని తెలుసుకుందికైనా వీలులేకపోయింది సుబ్బయ్యకి ఆవిడ ఫోటోకూడా లేకపోవడంచేత. ఆవిడగురించి సోమయ్య ఏసంగతీ కొడుకుతో చెప్పలేదు. కాని, తనతల్లి దేవతలతో సమానమని, ఆవిడవంటి ఉత్తమురాలు ఎక్కడా వుండబోదనీ, అకారణంగా ఆవిడ ఎన్నో కష్టాలు పడిందని ఊహించుకొంటూవుంటాడు సుబ్బయ్య. ఆవిడ తలపునకు వచ్చినప్పుడల్లా అతనికళ్లు చెమ్మగిల్లుతూ ఉంటాయి.

సుబ్బయ్య పదిహేనోయేట స్కూలుఫైనల్ పాసయేడు. పద్దెనిమిదేళ్ళునిండగానే ఉద్యోగంలో ప్రవేశించేడు. అతనికి పద్దెనిమిదేళ్లు నిండకుండానే సోమయ్య చనిపోయేడు. చిన్నప్పటినుంచీ ఒక్క తండ్రినే ఎరగడంచేతా, ఆ తండ్రి తననెంతో గారాబంగా చూడ్డంచేతా, ఆతండ్రి పడ్డ కష్టాల్ని తను కళ్లారా చూడ్డంచేతా, సుబ్బయ్యకి తండ్రియందు విపరీతమైన గౌరవం, అభిమానం. తండ్రిని తల్చుకున్నప్పుడల్లా సుబ్బయ్యకి సంతోషం, బాధాకూడా కలుగుతాయి. తండ్రిని సుఖపెట్టలేకపోయానే అని కించపడుతూ ఉంటాడు.

మానవుడికి భయం సహజం. కాని, భయంఅనేది సుబ్బయ్యలో ఎక్కువ మోతాదులో ఉంది. దానికి కారణం ఇదమిత్థమని చెప్పడం కష్టం. సుబ్బయ్యకి అయిదోయేడు నడుస్తున్నప్పుడు సోమయ్య ద్వితీయ వివాహం

చేసుకున్నాడు. అతని రెండవభార్య చాలా వికృతంగా ఉండడమే కాకుండా చాలా క్రూరంగా ఉండేది. ఆవిణ్ని మొదటిసారి చూడగానే సుబ్బయ్య జడుసుకొని తండ్రిచుట్టూ చేతులువేసి గట్టిగా పట్టుకు నిల్చుండిపోయేడు. వచ్చిన మర్నాడే ఆవిడ సుబ్బయ్యని కొట్టింది, అప్పటినుంచీ ప్రతిరోజూ కూడా కొట్టేది. లేత వయసులో, ఆమె ఉన్నన్నాళ్ళూ, సుబ్బయ్యపడ్డ మనోవేదన యాతన ఇంతా అంతా అని చెప్ప వీలులేదు. ఆవిడ ఒక్క సంవత్సరం మాత్రం సోమయ్యతో కాపురం చేసింది. తరువాత ఆవిణ్ణి పక్కింటి పెద్దమనిషి లేవదీసుకు పోయేడు. అందుగురించి అటుపిమ్మట పక్కింటి పెద్దమనిషి తప్పించి ఇంకెవ్వరూ విచారించలేదు. ఆవిడ వెళ్ళిపోయినప్పటికీ సుబ్బయ్యలో ప్రవేశించిన భయంమాత్రం అలానే వుండిపోయింది.

జీవితాన్ని చూస్తే సుబ్బయ్యకి భయం బాగా నాటిపోడానికి కారణం చెప్పలేం. కాని అతని జీవితంలో ఇంకొక సంఘటన జరిగింది.

అప్పుడు సుబ్బయ్యకి ఆరు సంవత్సరాలు.

ఒకరోజు సోమయ్య ఎక్కడికో వెళ్తున్నాడు. అతని చెయ్యిపట్టుకొని సుబ్బయ్య నడుస్తున్నాడు. బాగా రాత్రయింది. బాగా చీకటిగా ఉంది. రోడ్డుమీద జనసంచారం లేదు. తనూ, తండ్రీ ఎందుకు ఎక్కడికి వెళ్తున్నారో సుబ్బయ్యకి తెలియదు. తండ్రి చెయ్యిపట్టుకొని బితుకూ బితుకూ నడుస్తున్నాడు. నాలుగు కుక్కలు గట్టిగా మొరుగుతున్నాయి. రెండు గాడిదెలు తొందర తొందరగా పరుగెడుతున్నాయి. చిన్న చినుకు కూడా పడడం ప్రారంభించింది.

ఎవరో ముగ్గురు మనుష్యులు వచ్చేరు. ఎక్కడనుంచి అంత అకస్మాత్తుగా వచ్చారో తెలియదు. ముగ్గురూ మూడు వైపులా నిల్చున్నారు.

తండ్రిచేతిని ఇంకా గట్టిగా పట్టుకున్నాడు సుబ్బయ్య.

తండ్రి చెయ్యి వణుకుతోంది!

ఒక్కసారిగా సుబ్బయ్యని ఎత్తుకున్నాడు సోమయ్య. పారిపోబోయేడు, వాళ్ళు ముగ్గురూ వెటకారంగా నవ్వేరు. వెళ్ళకుండా అడ్డగించేరు. సోమయ్యని బూతులు తిట్టేరు. సుబ్బయ్యని ఒకడు బలంగా మోటుగా లాగి

పక్కకితో సేశాడు. కేక వెయ్యడానికైనా సుబ్బయ్యలో శక్తిలేకపోయింది. రాళ్లకుప్ప మీద పడ్డాడు. తలకి దెబ్బ తగిలింది. స్మృతిమాత్రం తప్పిపోలేదు.

"అమ్మో! నాయనో!" అని ఎవరో బాధతో భయంతో కేకలు వేస్తున్నారు.

మనిషిని కొడుతున్న చప్పుడు అవుతోంది.

సుబ్బయ్యకి చీకట్లో ఏమీ కన్పించడంలేదు. కాని, తండ్రిని వాళ్ళెవరో కొడుతున్నారని, అతను నొప్పితో కేకలు వేస్తున్నాడనీ తెలుసుకున్నాడు.

సుబ్బయ్య గుండెలు నీరయిపోయేయి.

భయంతో, దుఃఖంతో లేచి కూర్చొని ఏడ్చేడు.

ఇంతలో ఏవో భూతాల్లా పరుగులుతీస్తూ వచ్చేయి.

మరికొంత గట్టిగా కేకలు, అరుపులు, గాడిద కూతలు, కుక్కల మొరుగులు.

ఈలలు!

ఇంతలో ఈలల చప్పుడు. ఈలలు వినిపిస్తున్నాయి. దగ్గరపడుతున్నాయి.

అంతే.

తరువాత ఏం జరిగిందో సుబ్బయ్యకి జ్ఞప్తిలేదు. ఈ సంఘటన సుబ్బయ్య జీవితంలో చాలా భయంకరమైనది. అలా ఎందుకు జరిగిందో అతనికి కారణం తెలియదు. సోమయ్య అతడితో చెప్పలేదు. ఆ దృశ్యం ఇంకా అతని కళ్ళకి కట్టినట్లుంటుంది. ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రి అకస్మాత్తుగా నిద్రలేచి కూర్చుంటాడు.

"నాన్నని ఎవరో కొడుతున్నారు! చంపేస్తున్నారు!" అనిపిస్తుందతనికి.

చీకట్లో కన్నీరు కారుస్తాడతను.

రాత్రివేళ చీకట్లో ఎక్కడికైనా వంటరిగా వెళ్ళడానికి సాధారణంగా భయపడతాడు సుబ్బయ్య. కాని తన పిరికితనానికి కారణం తెలియదతనికి.

"పిరికిపంద" అనుకుంటూ వుంటుంది సుబ్బయ్య గురించి సావిత్రి.

సావిత్రికి దగ్గర దగ్గర ముప్ఫై సంవత్సరాలుంటాయి. ఆవిడది అందమైన విగ్రహం. పొడవుగా నాజూగ్గా ఉంటుంది. ఆవిడ నేత్రాలు విశాలంగా ఉంటాయి. "మావాళ్ళందరివీ పెద్దకళ్ళు" అని చెప్తూ ఉంటుందావిడ. "మా వంశంలో ఎక్కడా పిరికితనం లేదు" అని కూడా అంటూ వుంటుంది. ఆవిడ తండ్రి తాతలు జమీందార్లు. ఆమె తాత గణించినదంతా, ఎలక్షనులు, తాగుడు, జూదం వ్యభిచారం ఇత్యాదులకింద ఆమె తండ్రి తగలేసేశాడు. ఆమె తండ్రి చనిపోయేటప్పటికి వారికి అప్పు తప్ప ఇంకేమీ మిగల్లేదు. సావిత్రి చాలా చిన్నపిల్ల అప్పుడు. ఆ తరువాత ఒక సంవత్సరంలోనే ఆమె తల్లి కూడా చనిపోయింది. సావిత్రిని పెంచి పోషించి పెళ్ళిచేసే పూచీ అంతా ఆమె అన్న వెంకట్రావు మీద పడింది. అప్పటికి అతను కూడా చిన్నవయసులోవాడే. కాని ధైర్యం వహించి ముందుకు నడిచేడు.

ఆడపిల్లకి పెళ్ళి ప్రధానం అనే ఆలోచనతోనే కాకుండా ఆలస్యం అయినకొద్దీ ఆడపిల్లకి పెళ్ళవడం కష్టమని గుర్తించి సావిత్రికి ఇంకా యుక్తవయసు రాబోతూ ఉండగానే ఆమెని సుబ్బయ్యకి ఇచ్చి వివాహం చేసేడు వెంకట్రావు.

సుబ్బయ్య కంటె వెంకట్రావు వయసులో పెద్దయినప్పటికీ ఇద్దరూ ఒకే క్లాసు చదివేవారు. సుబ్బయ్య మెత్తనివాడనీ, జాగ్రత్తగా కాలక్షేపం చేసే మనిషనీ వెంకట్రావుకి తెలుసు. సుబ్బయ్యకి ఉద్యోగం అయిందని తెలియగానే "మా చెల్లెల్ని చేసుకుంటావా ?" అని సుబ్బయ్యని అడిగేడు.

వెంకట్రావు అలా అడగ్గానే సుబ్బయ్యకి చాలా గాభరా కలిగింది. వెంకట్రావు అంతస్తు తనదానికంటె చాలా ఎక్కువని సుబ్బయ్య అభిప్రాయం

అటువంటి కుటుంబంలోని ఆడపిల్లని తను పెళ్లాడగలనని అతను ఎప్పుడూ ఊహించి ఉండలేదు. అందుచేత వెంకట్రావు అడిగిన ప్రశ్నకి సంభ్రమాశ్చర్యాలతో 'సరే సరే' అన్నాడు.

సావిత్రికి అప్పటికి పదమూడు సంవత్సరాలు దాటేయో లేదో, కాని అప్పటికే బాగా ఏపరిగా ఉండేది. వయసు తక్కువే అయినా బుద్ధిలో, ఊహల్లో ఆమెది పెద్ద వయసు.

పెళ్ళిలో తప్పించి అంతకు ముందు ఆమె సుబ్బయ్యని చూడలేదు. సుబ్బయ్య కూడా అంతే. పెళ్లిలో పీటలమీద ఆమెని చూసినప్పుడు అంతటి అపురూప సౌందర్యవతిని తనకి కూర్చినందుకు సుబ్బయ్య భగవంతుడికి నమస్కారం చేశాడు.

సుబ్బయ్యని చూడగానే సావిత్రి ఆరీతిగా ఎట్టి నమస్కారాలూ చెయ్యలేదు.

సుబ్బయ్యని చూడగానే "ఇతనా నాకు పెనిమిటి" అనుకొంది ఆమె.

అంతవరకూ కూడా ఆమె ఏ రాజకుమారుడి లాంటివాణ్ణో పెళ్ళాడుతానని అనుకొనేది. ఆమె కంటికి సుబ్బయ్యలో రాజచిహ్నాలేవీ కనిపించలేదు. ఆమెని చిన్నతనంలో షికారుకి తీసుకువెళ్లడానికి ఓ 'ఆయా' ఉండేది. ఆయాకి ఒక కొడుకు ఉండేవాడు. సుబ్బయ్యని చూసిన వెంటనే సావిత్రికి ఆయా కొడుకు స్ఫురణకి వచ్చేడు. ఆయాల పిల్లలు కూడా మనుష్యులే అనుకొనే వ్యక్తి కాదామె. అందుచేత ఆమెకి సుబ్బయ్య యందు ఎట్టి గౌరవమూ లేకుండా పోయింది. తనలాంటి జమీందార్ల పిల్లని పెళ్ళాడ్డానికి సాహసించినందుకు సుబ్బయ్యని ఆమె క్షమించలేదు.

సుబ్బయ్యకూడా సావిత్రికి తను తగననే అభిప్రాయం ఆదిలోనే కలిగింది. అందుచేత సావిత్రి యెడల చాలా భయభక్తులతో మసులుతాడు.

సుబ్బయ్యకి ఉద్యోగం అంటూ ఒకటి ఉంది.

# 8

"ఈ ఉద్యోగమే లేకపోతే నేను చిల్లిగవ్వకి మారకపోయి వుందును" అనుకొంటూ వుంటాడు సుబ్బయ్య. డబ్బు సంపాదించే మార్గాలు అతనికి చాలా తక్కువ తెలుసు. అందుచేత, డబ్బు సంపాదించే వాళ్ళయందు అతనికి చాలా గౌరవం.

సుబ్బయ్య ఆఫీసులో పని జాగ్రత్తగానే చేస్తాడు; కాని చాలా నెమ్మదిగా చేస్తాడు. అందుచేత ఆఫీసులో అంతా అతనిమీద విసుక్కుంటూవుంటారు. ఆఫీసర్లతో అతను భయంవల్ల సరిగ్గా మాట్లాడలేడు. వారడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పడానికి అతను తడబడతాడు.

కోపదారి ఆఫీసరు ఒకాతను సుబ్బయ్య నసుగుడు కంగారు చూసి "నువ్వు చాలా ఇనెఫిషియన్ట్‌గా కనుపిస్తున్నావు. రేపట్నించి డిస్పేచ్ సెక్షన్కిపో" అని కసిరేసేడు. అప్పటి నుంచీ కొన్ని సంవత్సరాలు సుబ్బయ్య డిస్పేచ్ సెక్షన్లో పని చేసేడు. ఆ సెక్షన్లోది చాలా బండపని. కాని, మిగతా 'సెక్షన్స్'లో కంటె పూచీ కొంచెం తక్కువ. తెలివితేటలు ఉపయోగించ నవసరం లేదు.

డిస్పేచ్ సెక్షన్ పని చాలా బండపని.

కాని 'ఇదే బావుంది' అనుకొనేవాడు సుబ్బయ్య.

తరువాత—

కొత్త 'హెడ్‌క్లార్కు' వచ్చాక సుబ్బయ్య అక్కౌంట్సు సెక్షన్లోకి మారేడు.

కొత్త హెడ్ గుమస్తా పేరు రామస్వామి. అతణ్ని ఫలానావూరు, ఫలానాదేశం అని చెప్పడం చాలా కష్టం. అతను తెలుగు స్వచ్ఛంగా మాట్లాడుతాడు. అరవం మాట్లాడితే అరవ్వాడే అనుకోవచ్చు. అతనికి మళయాళీ భాష బాగా వచ్చు. కన్నడంలో అతనికి ప్రవేశం ఉంది. అతనికి రైల్వే హిందీ వచ్చు. అతను చాలా తెలివైనవాడని అంతా అంటారు. అతను ఆఫీసులో ఎవ్వర్నీ నమ్మడు. అందర్నీ భయంలో ఉంచాలని అతని

'పాలిసీ'. అనువైన వాళ్ల చేత అరవచాకిరీ చేయిస్తూ ఉంటాడు. అనువైన వాళ్లని కసరడం కూడా అతనికి అలవాటు.

రామస్వామి వచ్చిన కొద్దికాలంలోనే సుబ్బయ్యకి అక్కౌంట్సు సెక్షన్ లోకి మార్పు వచ్చింది. మార్పుకి కారణం తెలిసినవాళ్లెవరూ ఆశ్చర్యపడలేదు అందు గురించి. సుబ్బయ్య మాత్రం చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆశ్చర్యపడ్డం కంటె హెచ్చుగా భయపడ్డాడు.

అక్కౌంటు, సెక్షన్లో చిక్కులు చాలా ఉన్నాయి. కంట్రాక్టర్ల బిల్సు చెక్ చెయ్యడం ముఖ్యమైనపని. అందులో చాలా జాగ్రత్తగా ఉండాలి. కంట్రాక్టర్లు ఒకవైపు పీకుతూ ఉంటారు. ఆశ పెడుతూ ఉంటారు. బిల్సు సరిగా చెక్ చేయకపోతే ప్రమాదం ఉంటుంది. అందులోనూ ఆ పని సుబ్బయ్యకి కొత్త. కాని ఏదో తంటాలుపడుతూ వస్తున్నాడు.

సుబ్బయ్య చేసే పని, అంతకుముందు అవధాని చేస్తూ ఉండేవాడు.

వయస్సులో అవధాని ఆఫీసులో చాలామంది కంటె పెద్ద. అయినా, ఆఫీసులో కొత్తగా ప్రవేశించిన వాళ్ళు కూడా అతన్తో చిరపరిచయుల్లాగ వ్యవహరిస్తూ చనవుగా వుంటారు. అతనికి దాదాపు యాభై సంవత్సరాలు ఉంటాయి. అతని తలమీద జుత్తు లేనే లేదు. అతన్ది మెల్లచూపు. అతని చెవలకి ఎర్రపాళ్ల తమ్మెట్లు ఉంటాయి. అతని నోరు చాలా పెద్దది. గొంతుక కూడా చాలా పెద్దదే. అతని ముఖమంతా గంట్లు గంట్లుగా ఎర్రగా ఉంటుంది. లావు కాకుండా సన్నం కాకుండా ఉంటుంది అతని శరీరం ఎత్తు సుమారుగా ఉంటుంది.

అవధాని దగ్గర డబ్బు మూలుగుతోందనే వాడుక ఒకటున్నాది. "పిల్లా పాపా లేరు కదా, ఏం చేసుకుంటావయ్యా, అంత డబ్బు" అని అతన్ని చాలామంది అడుగుతూ ఉంటారు. "పెట్టుకున్నదానికి లేకపోతే సరా" అంటాడు జవాబుగా అవధాని. వివాహం చేసుకోక ముందు నుంచీ కూడా అతను వేరే ఓ మనిషిని ఉంచుకున్నాడు. ఆమెవల్ల అతనికి చాలా సంతానం ఉంది. వాళ్లంటే అతనికి చాలా అభిమానం. అతనే కాకుండా అతని భార్య

కూడా వాళ్ళయందు సఖ్యతతో ఉంటుంది. అందు గురించి చాలామంది సిద్ధాంతంగా చెప్పుకుంటారు.

అవధాన్ని చూస్తే ఆఫీసులో పని చెయ్యటానికే పుట్టేడా అనిపిస్తుంది. అతనికి ఆఫీసులో ఉంటేనే ఇంట్లో ఉన్నట్లు ఉంటుంది. ఆఫీసులో అన్ని శాఖల పనీకూడా అతనికి బాగా తెలుసు. అందుచేత ఆఫీసులో ప్రతివారికీ అతని యందు అదొక తరహా గౌరవం ఉంది.

"మామూళ్ళు" పుచ్చుకోడంలో అవధాని నిర్మొహమాటంగా ఉంటాడు. అందుకే అతనికీ రామస్వామికీ పేచీ వచ్చింది. అతనికీ రామస్వామికీ మొదటి నుంచి సరిపడలేదు. ఇద్దరూ డబ్బు దగ్గర దొంగలే అన్న విషయం ఇద్దరికీ తెలుసు. అవధాని ఎకౌంట్సు సీట్లో ఉంటే మామూళ్ళలో తనకి వంతు రానేరాదని రామస్వామి వచ్చిన వెంటనే గ్రహించేడు. కానీ అవధాన్ని కదల్చడం వెంటనే సాధ్యం కాలేదు. ఇంతలో రామస్వామి అదృష్ట వశాత్తూ అతని బంధువే ఒక ఉత్తము ఆక్టింగ్‌గా ఆఫీసరయేడు. అతని హయాంలో అవధాని సీటు మారింది.

సీటు మార్చినందుకు అవధాని ఏమీ చింతించలేదు. డిస్పేచ్ సెక్షన్లో కూడా డబ్బు చేసుకొనే నేర్పు అతనికి ఉంది. అదీగాక, త్వరలోనే తిరిగి మామూలు సెక్షన్కి రాలేకపోతానా అనే ధైర్యం ఉందతనికి.

సుబ్బయ్యకి మామూళ్ళు పుచ్చుకోడంలో నేర్పు లేదు. పుచ్చుకోడానికి ధైర్యం లేదు. అందుకే అతణ్ణి ఎకౌంట్సు సీట్లోకి రామస్వామి లాగేడని ఆఫీసులో అందరికీ తెలుసు. సుబ్బయ్య కూడా త్వరలోనే తన 'సీటు' మార్పుకి కారణం తెలుసుకున్నాడు.

"సరే! నాకెందుకు ఆ గొడవంతా? నా పనేదో నేను చూసుకొని వచ్చేస్తాను. నా జీతపురాళ్ళు నాకు రాక మానవు"

అనుకున్నాడు సుబ్బయ్య.

# 2

వేసవి కాలం.

ఉదయం.

వేసవికాలంలో ఒక రోజు ఉదయం ఏడు గంటల సమయంలో సుబ్బయ్య ఇంటికి వెంకట్రావు వచ్చేడు.

ఇంట్లో ఉన్న ఒక్క కుర్చీలో కూర్చోకుండా వీధి వరండాలో నిల్చొని కాఫీనీళ్ళు త్రాగుతున్నాడు సుబ్బయ్య.

ఇంటి లోపలిభాగంలో ఉండడానికి సుబ్బయ్య సాధారణంగా ఇష్టపడడు. సావిత్రిని పెళ్ళిచేసికొని పదిహేను సంవత్సరాలు దాటినా ఆమెతో ఇంకా అలవాటు పడలేదతను. ఆమెతో ఏంమాట్లాడ్డానికీ తోచదతనికి. అందుచేత తరచు వీధి వరండాలో కూర్చుంటూ ఉంటాడు. అలా కూర్చొని వచ్చి పోయేవాళ్ళని చూస్తూ ఉండడం అతనికి అలవాటు.

వీధిలో అన్ని వేళలా అనేకమంది వెళ్తూ ఉంటారు. నడుచుకుపోతూ ఉంటారు. వాహనారూఢులయి వెళ్తూ ఉంటారు. ఆడా మగా, చిన్నా పెద్దా, గొప్పా బీదా అనేకతరహాల మనుష్యులు ప్రవాహంగా పోతూ ఉంటారు. వాళ్లందర్నీ చూస్తూంటే సుబ్బయ్యకి ఎంతో ఆనందంగా ఉత్సాహంగా ఉంటుంది.

సుబ్బయ్య ఆ వూరు వచ్చి మూడు సంవత్సరాలయింది. ఈ మూడేళ్లలోనూ రోడ్డుమీద పోయేవారి ననేకమందిని అతను బాగా గుర్తెరుగును. వాళ్లెవరో, ఏం పని చేస్తున్నారో; రోజూ ఎందుకు అలా వెళతారో అతనికి తెలియదు. అయినా వాళ్ళల్లో అనేకమంది గురించి అతనేదో ఊహించుకొంటూ ఉంటాడు. వాళ్ల గురించి చిత్రమైన కథలు కల్పించుకొంటూ ఉంటాడు. వారిలో కొందరు అతనికి ఇష్టమైన వారున్నారు. కొందర్ని చూస్తే అతనికి చాలా అయిష్టం. వారిలో కొందరు ముఖ్యులున్నారు. కొంతమంది ఒక్క సాయంకాలమే సుబ్బయ్య ఇంటి ముందునుంచి వెళ్తారు.

కొందరు పొద్దుటా సాయంత్రమూ కూడా అవుపిస్తారు. ఎవరెవరు ఏయే వేళల వెళతారో సుబ్బయ్యకి బాగా గుర్తు. వాళ్ళందరి గురించే ఆలోచిస్తూ కథలు కల్పించుకొంటూ వీధి వరాండాలో సిగరెట్లు కాలుస్తూ కూర్చుంటే సుబ్బయ్యకి ఊసుపోతుంది.

సుబ్బయ్యకి, ఆరీతిగా రోజూ కనిపించేవారిలో నలుగుర్ని చూస్తే ఎక్కువ ఇష్టం.

నలుగుర్లోనూ ఒకామె సరిగా ఏడుంపావుకి బజారు వైపు వెళ్తుంది. ప్రతిరోజూ ఉదయం ఆ సమయానికే వెళ్తుంది. సుబ్బయ్యకి ఆమెని చూస్తే ఇష్టం. ఆమె ఎవరో అతనికి తెలియదు. ఆమె పేరు అంతకంటే తెలియదు. కాని తనే ఆవిడకి "ఎర్రచీర మనిషి" అని నామకరణం చేసేడు. అందువల్ల ఆమె ఎప్పుడూ ఎర్రచీరే కట్టుకుంటుందనుకోకూడదు. సుబ్బయ్య ఆవూరు వచ్చిన కొత్తలో ఆమెని ఎరుపురంగు చీరతో చూసేడు. ఆమె ఎందుకో గాని అతన్ని ఆకర్షించింది. తరవాత నాలుగైదు రోజులు కూడా ఆ చీరే కట్టుకొని వెళ్ళింది, ఆమె. లెక్క పెడదామని అనుకోకుండానే సుబ్బయ్య లెక్క వేశాడు. ఆ ఒక్క చీరా ఆవిడ సరిగా ఇరవై రెండు దినాలు కట్టుకొంది. అప్పటినుంచి ఆమెని ఎర్రచీర మనిషిగానే గుర్తుంచుకొన్నాడు సుబ్బయ్య. ఆమె చాలా దరిద్రురాలిగా అవుపిస్తుంది. కాస్త సన్నగా పొడవుగా ఉంటుంది. పెద్దకొప్పు నున్నగా నీటుగా ఎప్పుడూ ముడుచుకొంటుంది. ఆమె వయసు పాతికేళ్ళపైచిలుకు ఉండవచ్చు. మనిషి చూడ్డానికి చాలా బావుంటుంది. ఆ వయసు స్త్రీలలో ఉండవలసిన బిగి ఆమెలో లేకపోయినా బలంగానే ఉంటుంది. ఆమె ముఖంలో వికాసం అవుపించదు. రోడ్డుమీద ఎవ్వరితోకూడా ఆమె మాట్లాడ్డం సుబ్బయ్య చూడలేదు. ఆమె చేతిలో ప్రతిరోజూ ఓ మాసిన చిన్న సంచీ ఉంటుంది. ఆ సంచీ ఆమె ఎప్పుడూ ఎడంచేత్తోనే పట్టుకొంటుంది. సుబ్బయ్య అనుకోడం ఆమె ఎక్కడో ఎవరింట్లోనో పనిమనిషిగా ఉందని. ఆమె భర్త 'మిలిటరీ' లో ఉన్నాడని అతను అనుకుంటాడు. భర్త దగ్గర్నుంచి ఉత్తరాల్లేవు. బతికి

ఉన్నాడో లేదో తెలియదు. ఇంట్లో ఓ జబ్బు కొడుకు, చిన్న పిల్లడు, వాడు. వాడికోసం కష్టపడుతోంది. భర్త రాకకోసం నిరీక్షిస్తోంది. అతను ఎంతకీ రాకుండా ఉన్నాడు. ఆమె చాలా శ్రమకి పాలవుతోంది. ఆమె అందం అంతా అడవిగాచిన వెన్నెల అవుతోంది. అనేకమంది మొగవాళ్లు ఆమెని పొందడానికి రమ్మని ఆహ్వానిస్తున్నారు. అందర్నీ నిరాకరిస్తోందామె. జబ్బుతో ఉన్న కొడుకు పెద్దవాడయి గొప్పవాడవుతాడని ఆశిస్తోంది. నిజంగా వాడు చాలా గొప్పవాడవుతాడు. అప్పుడు ఆమె చుట్టూ అంతా చేరుతారు. గర్వం లేకుండా అందర్నీ ఆదరిస్తుంది ఆమె.

ఆమెని చూస్తే సుబ్బయ్యకి నిజంగా చాలా ఇష్టం. మిగతావారిలో ఒకతను అరవయ్యేళ్ళ వృద్ధుడు. అతను చాలా పొడవుగా ఉండి చాలా నిటారుగా నడుస్తాడు. చాలా ఆరోగ్యంగా ఉన్నట్టు అగుపిస్తాడు. దట్టంగా పొడవుగా ఉండే నెరసిన గడ్డం అతన్ది. పండిన గిరజాల జుత్తుపైన తెల్లటి వంకీ తలపాగా చుట్టుకుంటాడు. అతను ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని చూసి మందహాసం చేస్తూనే ఉంటాడు. అతని చేతిలో ఎప్పుడూ పొడుగాటి చేపాటికర్ర కదలాడుతూ ఉంటుంది. అతని కళ్లు ప్రతివారిమీదా వెన్నెల వెలుగులు చిలుకుతాయి. ఏ పాడుకర్మ చేతనో, ఏ క్రూరశాపవశం చేతనో ఓ మహాత్ముడు ఈ కలికాలంలో ఇలా మానవరూపంలో అవతరించేడని అతని గురించి సుబ్బయ్య ఊహించుకొంటూ ఉంటాడు. అతని దివ్యసుందర విగ్రహం చూసి ఏ దేవతాస్త్రీయో వలచి పిలచి ఉంటుంది. తిరస్కృతురాలై తిరుగులేని ఘోరశాపం ఇచ్చింది. ఘోరమైన ఈ లోకంలో పడ్డాడతను. అయినా, అతను విరాగి. అతనికి నాకలోకమందున్నా ఒకటే. నరకలోకానికిపోయినా ఒకటే. నక్కలమధ్యపడినా ఒకటే. శాంతంగా ప్రశాంతంగా ఉంటాడతను. అతణ్ణి చూసినప్పుడల్లా భగవంతుడనేవాడు ఉన్నాడని గుర్తుకొస్తుంది సుబ్బయ్యకి. అతనొక ఋషిలా ఉంటాడు. సుబ్బయ్య అతణ్ణి "మునీశ్వర్లవారు" అంటాడు. అతని యెడ సుబ్బయ్యకి భక్తి గౌరవాలు ఉన్నాయి.

మిగతా ఇద్దరూ ఆడపిల్లలు.

"లేడి పిల్లలు" అంటాడు సుబ్బయ్య వాళ్ళని.

వాళ్ళిద్దరూ కవల పిల్లల్లాగ అగుపిస్తారు. వయసు పధ్నాలుగు సంవత్సరాలు ఉండవచ్చు. రూపుకి ఇద్దరూ ఒక్కలాగే ఉంటారు. రూపుకి వాళ్ళు అందంగా ఉండరు. అయినా, చాలా ఆకర్షణీయంగా ఉంటారు. ఎప్పుడు ఒకేరకం దుస్తులు ధరిస్తారు. ఎప్పుడోగాని చీరలు కట్టరు. పరికిణీ, జుబ్బా వేసుకుంటారు. అప్పుడప్పుడు 'వాణీ'లు వేసుకుంటారు. వాళ్ళెప్పుడూ నవ్వుతూ ఉంటారు. పొద్దుటా, సాయంకాలం చేతుల్లో పుస్తకాలతో, టిఫిన్ కేరియర్లతో స్కూలుకి వెళ్తూ వస్తారు. దార్లో అనేకమందిని పలకరిస్తారు. పలకరించి ఏవేవో కబుర్లు చెప్తారు. వాళ్ళవంటిమీద విలువగల ఆభరణాలేవీ కనిపించవు. వాళ్ళు నిరాడంబరంగా ఉన్నా నిండుగా ఉంటారు.

వాళ్లు చాలా గొప్పవాళ్ళు అవాలని సుబ్బయ్య కోరిక. వాళ్ళకొక సవిత్తల్లి ఉన్నాదని అతని కెందుకోగాని తోచింది. ఆమె వాళ్లని కష్టాలు పెడుతుంది. ఇంటి దగ్గర అంత చాకిరీకూడా వాళ్ళచేతే చేయిస్తుంది. అయినా వాళ్ళు దేనికీ లక్ష్యపెట్టరు. ఎంత చాకిరీ అయినా చేసేస్తారు. అందుగురించి ఏమీ విచారించరు. ఎప్పుడూ సంతోషంగానే ఉంటారు. ఇంట్లో చదువు సాగకపోయినా, క్లాసులో తెలివైనవాళ్ళనే అనిపించుకొంటారు. వాళ్ళిద్దరికీ త్వరలోనే పెళ్లవుతుంది. మిక్కిలి బీదవాళ్ళ కిచ్చి పెళ్లి చేస్తుంది వాళ్ల సవిత్తల్లి. కాని, ఆడదాని అదృష్టం వల్ల ఆ బీదవాళ్ళే ఎంతో గొప్పవాళ్ళవుతారు. అప్పుడీ రెండు లేడిపిల్లలూ బంగారపు లేళ్ళవుతాయి.

"చక్కటి లేడి పిల్లలు" అనుకుంటాడు సుబ్బయ్య.

ఇంకా అనేకమంది వస్తూ వెళ్తూ ఉంటారు.

కొత్తకారు నడుపుకొంటూ పోయే హార్బర్ ఇంజనీరూ, పాతకార్లో డ్రైవరు పక్కన కూర్చొనే లేడీడాక్టరు, 'రేలీ' సైకిలుమీద రోజూపోయే

ఇటికల కంట్రాక్టరూ, కొబ్బరికాయలతట్ట నెత్తిన పెట్టుకుపోయే వయ్యారి భామా, రోజూ కోడిమాంసం కొనుక్కువచ్చే కుంటికాలువాడూ, ఎప్పుడూ రాత్రివేళే కనిపించే సిల్కు జాకెట్టుపిల్లా — ఇలా అనేకమంది ఉన్నారు. వాళ్ళందరి గురించీ కూడా సుబ్బయ్య ఏవో కథలు అల్లుతాడు; అల్లుతూ ఆలోచిస్తూ వీధి వరండాలో కర్రి స్తంభం చాటున కూర్చుంటాడు. అదొక సరదా అతనికి.

మామూలు ప్రకారం వరండాలోకి కాఫీ తాగుతూ వస్తున్నాడు సుబ్బయ్య. ఎర్రచీర మనిషి వచ్చే వేళ అవుతోంది.

ఇంతల్లో వెంకట్రావొచ్చాడు.

అతణ్ణి చూసి సుబ్బయ్య కంగారు పడ్డాడు.

వెంకట్రావు ఎప్పుడో గాని సుబ్బయ్య దగ్గరికి రాడు. మూడు సంవత్సరాల్లోనూ ఏ నాలుగైదుసార్లో సుబ్బయ్య ఇంటిని తన రాకతో పావనం చేసా డతను. అతను వచ్చినప్పుడల్లా సుబ్బయ్య కంగారు పడక మానడు. అతను వస్తే నిజంగా తన ఇల్లు పావనమయినట్టే భావిస్తాడు.

సుబ్బయ్య ఇంటిని పావనం చేసే వెంకట్రావు పవిత్రుడు కాడు. కాదని సుబ్బయ్యకి తెలుసు. అయినా వెంకట్రావంటే అతని కెంతో గౌరవం.

వెంకట్రావు తండ్రి తాతలు జమీన్దార్లు. చాలా గొప్పగా బ్రతికేరు. కాని వెంకట్రావు తండ్రితోటే అరిపోయింది ఉన్న చమురంతా. అయితే నేం? వెంకట్రావు పెద్ద వంశంలో పుట్టేడు. అతని స్టేటస్ తనదానికంటె హెచ్చు సుబ్బయ్య దృష్టిలో.

వెంకట్రావుది అగ్గిని కుప్పే పెర్సనాలిటీ. సుమారు ఆరడుగుల పొడ వుంటాడు. అతని కళ్ళు చాలా అందంగా విశాలంగా ఉంటాయి. పొడ వైన కనుబొమ్మలతో, బరువైన కంటి రెప్పలతో, ఎర్రజీరల కళ్ళతో ఎవ ర్నయినా కిందిచూపు చూడగల డతను. సాధారణంగా అందర్నీ అలాగే

చూస్తాడు. మనిషి అట్టే బలంగా లేకపోయినా బలంగా ఉన్నట్లు కనిపిస్తాడు. అతని కాళ్ళూ చేతులూ చాలా పొడవు చుట్టలు తెగ కాల్చడం చేత అతని పెదవులు నల్లబారేయి. అతని ముక్కు కొంచెం వంకరగా పొడవుగా ఉంటుంది. పొడుగ్గా ఉండే జుత్తుని వెనక్కి దువ్వుకుంటాడు. అతని మాట బొంగురుగా గంభీరంగా వస్తుంది. అవసరం కొద్దీ ఏకం ఎలా మాట్లాడ్డమో అతనికి బాగా తెలుసు. డబ్బు కోసం కొంతమందిని 'లైసు' కొట్టి తిరిగినప్పటికీ, ఎవరి దగ్గరా "దాసోహం" అని అతను ప్రవర్తించడు. చాలామందిలో "నువ్వెంత" అన్నట్టు బేఖాతర్‌గా, నిర్లక్ష్యంగా ఉంటాడు. పద్దెనిమిదేళ్ళ ప్రాయం వరకూ వెంకట్రావు విచ్చలవిడిగా తిరుగుతూ, చిత్తుగా డబ్బు ఖర్చుపెడుతూ, స్నేహితులతో షికార్లు కొడుతూ, ఆడపిల్లల్ని వెంబడిస్తూ కాలక్షేపం చేసేడు. ఇంతలో అతని తండ్రి చనిపోడం తటస్థించింది. అతని తండ్రి జమీందారన్న మాట నిజమే. కాని, తండ్రి చనిపోయేసరికి వెంకట్రావు చేతిలో కానీ 'కేష్' లేదు. కేష్ లేకపోతే పోయింది. తంటా లేదు. కాని, నెత్తిమీద అప్పులవాళ్ళు కూర్చున్నారు.

వెంకట్రావుకి, తండ్రి పోయాడన్న దుఃఖం అటుంచగా, ఆ స్థితి విషయమై ఉన్న పరిస్థితి అర్థం కాలేదు.

అతనికి ఏం చెయ్యడానికి తోచలేదు.

ఏమీ చెయ్యకుండా అప్పులవాళ్ళు ఊరుకోలేదు.

ఆస్తుల్ని ఒక్కటొక్కటి జప్తు చేయించి కబళించడం ప్రారంభించేరు.

జరుగుతూన్నదేమిటో వెంకట్రావుకి తెలియడమే లేదు.

ఇలా ఉండగా నరసయ్య వచ్చేడు సాయం చెయ్యడానికి.

వెంకట్రావుకి మేనమామ అవుతాడు నరసయ్య.

వెంకట్రావు తండ్రి ఉన్న రోజుల్లో నరసయ్య ఎప్పుడూ వారి ఇంటికి రాలేదు. బావమరదు లిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది. బావ చనిపోయాక తన అక్క పరిస్థితులు బాగులేవని తెలిసి చేతనైన సహాయం

చేద్దామని వచ్చేడు నరసయ్య. అతనికి ఒక్కర్తె కూతురు. ఆ అమ్మాయి పేరు శాంతమ్మ. అప్పటికి దానికి పన్నెండేళ్ళు. వెంకట్రావుకి ఆ పిల్లని ఇచ్చి పెళ్ళి చేద్దామనే ఆశతో కూడా వచ్చేడు నరసయ్య.

నరసయ్య వచ్చేసరికి వెంకట్రావు స్థితిగతులు ఏమీ బాగా లేవు. పరిస్థితి అంత చెడ్డగా ఉన్నాదని నరసయ్య అనుకోలేదు. తన బావ పెద్ద స్థితిపరుడు. కొంత తగలెట్టినా, కొంతయినా మిగిల్చి ఉంటాడనుకున్నాడు నరసయ్య.

తీరా వచ్చి చూస్తే అంతా అధోగతిలా ఉంది.

ఎస్టేటంతా కోర్టు జప్తులో ఉంది. ఇళ్ళమీద తనఖాలున్నాయి. శేరీ భూములు కూడా చాలామట్టుకు రైతుల స్వాధీనంలోనే ఉన్నాయి. మిగతా భూముల పంట పాలికాపులు హరించేస్తున్నారు. ఇంట్లో ఉండే వెండి బంగారం ఇంట్లో కనిపించడం లేదు.

ఇంట్లో ఉండవలసిన వజ్రాల నగలన్నీ తాకట్టులో ఉన్నాయి. ఎవరి దగ్గర వున్నాయో ఇంట్లో ఎవరికీ తెలియదు. తాకట్టు పట్టినవాళ్ళు కిక్కురు మనకుండా ఊరుకున్నారు.

ఎస్టేటు వకీలు ఎన్నిసార్లు వెళ్ళినా పొమ్మంటాడు.
పనికొచ్చే కాయితమేదీ ఇంట్లో కనిపించదు.
ఏం చేద్దామన్నా నరసయ్యకి కాలూ చెయ్యీ ఆడింది కాదు.

అన్ని వ్యవహారాలూ చాలాకాలం నుంచీ చూస్తున్న వాడు కామేశం అనే గుమాస్తా. అతను చాలా ముసలివాడు. డెబ్భై సంవత్సరాల వయసయినా ఉంటుంది. అతను వెంకట్రావు తాత కాలం నుంచీ కూడా వ్యవహారాలన్నీ చూసుకువస్తున్నాడు. అతనికి వెంకట్రావు కుటుంబ విషయాల్లో తెలియనిదేదీ లేదు. చాలాకాలం అతను చాలా విశ్వాసంగా పని చేసేడు. వెంకట్రావు తండ్రి కాలంలో కొన్నాళ్ళకి "ఇహ లాభం లే"దని అతనికి

తెలిసింది. "ఈ కాస్త ఇహ నిలబడద"ని ముందుగానే తెలుసుకున్నాడు. డబ్బంతా ముండలకీ, తాగుడుకీ, జూదానికీ ఖర్చవుతూ ఉంటే అతనికి చాలా కష్టం అనిపించింది. న్యాయంగా వచ్చే జీతపురాళ్లు తప్ప ఇంక ఇతరానికి ఆశపడలేదతను చాలాకాలం. "సొమ్మంతా నిష్కారణంగా సానివాళ్ళకీ, బ్రాందీ సీసాలకీ అయిపోతోంది. ఆఖరికి మిగిలేది ఎవరికీ కూడా ఏమీ ఉండదు" అనుకున్నాడు కామేశం. "నే నింత కష్టపడుతున్నా నా దగ్గర కాణీ లేదు కదా!" అని కూడా అనుకున్నాడు కామేశం. అతనికి చాలా మంది పిల్లలు. అందులో ఆడపిల్లలు హెచ్చు. వాళ్ళందరికీ పిల్లలున్నారు. చదువులు చెప్పించవలసిన మొగపిల్లలు ఇంకా ఉన్నారు. పెళ్ళిళ్ళు చేయ వలసిన ఆడపిల్లలు ఇంకా ఉన్నారు. చదువులు చెప్పించాలి. పెళ్ళిళ్ళు చేయించాలి. ఇవన్నీ చేయడానికి సొమ్ము కావాలి.

జమీన్దార్ గారి డబ్బు సానులకి పోతోంది. జూదంలో పోతోంది.

"వాడు చూస్తే డబ్బు అవసరంగా వుంది" అనుకున్నాడు కామేశం.

జమీన్దారిలాగా చెడిపోడం తథ్యం. ఆయన డబ్బంతా ఆ సానులే తినడానికి బదులు తనవంటి సంసారి ఎందుకు తినకూడదనుకున్నాడు కామేశం. వాళ్ళల్లో ఎవరూ కూడా జమీన్దార్ కి ఎన్నడూ ఏట్టి సహాయమూ చెయ్య లేదు. తను మాత్రం చిన్నతనం నుంచీ చెమటోడ్చి ఆ జమీందారీలో చాకిరి చేస్తున్నాడాయన. అటువంటప్పుడు జమీన్దారీలో తనేది తిన్నప్పటికీ అది "అన్యాయపు సొమ్ము" అనిపించుకోదు.

ఆ నిశ్చయానికి వచ్చేక కామేశం మెల్లమెల్లగా వెలుగు వుండగానే చక్కబెట్టుకోడం మొదలు పెట్టేడు. అతను ఎస్టేట్లో, ఇంట్లో, జమీందారు స్వంత విషయాల్లో ఎరగని దేదీలేదు. అతనికి మంచి తెలివి తేటలు కూడా వున్నాయి. త్వరలోనే కొంత డబ్బు వెనక్కి వేసేడు. అంత తొందరగా అలా చేయగలిగినందుకు అతనే ఆశ్చర్యపోయేడు. దాంతో ఆశ హెచ్చింది.

వెంకటాద్రివు తండ్రి చనిపోయేసరికి కామేశం నలభైవేల రూపాయిల స్థితిపరుడయేడు.

వెంకటాద్రివు తండ్రి హఠాత్తుగా చనిపోయేడు. అతనలా పోయినం దుకు కామేశ చాలా విచారించేడు. కబురు వినగానే అతని కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగేయి. చనిపోయిన జమీన్దార్ని, అతని తండ్రినీ తల్చుకొని. చాలా ఏడ్చేడు.

అది అంతటితో అయిపోయింది.

ఆ మర్నాడు అన్ని పరిస్థితులూ పరికించి చూసేడు. తెలివితేటలు ఉపయోగించి ఆట జాగ్రత్తగా ఆడినట్లయితే మరొక పాతిక వేలయినా చేతి లోకి వస్తాయని అంచనా వేసేడు. జమీందారీ ఎస్టేటూ, శేరీ భూములు; ఇళ్ళూ వగైరాలన్నీ ఎలాగా అప్పులవాళ్ళ పాలవుతాయి.

బంగారం వెండీ ఇదివరకే అమ్మడయిపోయింది.

ఇహ మిగిలినవి వజ్రాలు నగలు. అవి ఎవరి దగ్గర తాకట్లో ఉన్నాయో ఆతనికి తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. తెలియడానికి అవకాశం లేదు.

అవి అతని దగ్గరే ఉన్నాయి.

ఇంకెవరెవరి దగ్గరో తాకట్టు వుంచినట్టుగా జమీందార్‌తో చెప్పేడు. కాని, నిజానికి అవి తన దగ్గరే వున్నాయి. ఆ సంగతి పైకి తెలిస్తే అవికూడా అప్పులవాళ్లే అపహరిస్తారు. అందుచేత తెలియజేసి లాభం లేదనుకున్నాడు కామేశ. వాటిని తను చేజిక్కించుకోకుండా, అప్పులవాళ్లకి తెలియకుండా వెంకటాద్రివుకి ఇవ్వవచ్చునని అతను ఎప్పుడూ అనుకోలేదు. అటువంటి ఆలో చనల్ని అతను దగ్గరికి రానివ్వలేదు.

అందుచేత కామేశ కిక్కురుమనకుండా ఊరుకున్నాడు.

ఈ లోపున నరసయ్యా వచ్చేడు.

నరసయ్యా రాక కామేశకి సుతరామూ కిట్టలేదు.

నరసయ్యని చూడగానే "ఇతను న్యాయమైన మనిషి. ముక్కుకి సూటిగా పోతాడు" అనిపించదు ఎవరికైనా సరే. కామేశానిక్కూడా

అలా తోచలేదు నరసయ్యా కూడా ఏదో తడుముకొందికే వచ్చేడని కామేశ అనుకున్నాడు.

అటువంటి దురాలోచనతో గాని దురాశతో గాని నరసయ్యా రాలేదు, నిజంగా. అక్కనీ, మేనల్లుణ్ణీ ఏదో ఒకదారికి తీసుకువద్దామనే అతని ఉద్దేశం. ఆ వుద్దేశాన్ని ఆచరణలో ఎలా పెట్టాలో తెలయలే దతనికి.

కామేశకి కుటుంబ పరిస్థితులన్నీ ఒక్కగా తెలుసుననీ, కాని పైకేమీ పొగలకుండా వున్నాడనీ నరసయ్యా గ్రహించేడు. కామేశని ఎలా కదల్చ డమా అని ఆలోచించేడు.

కామేశా, నరసయ్యా, ఇద్దరూ గండుపిల్లులాగ కొన్నాళ్ళు ఒక రొన్నొకరు చూసుకున్నారు.

ఎక్కడా దొరకననే ధీమాతో వున్నాడు కామేశ.

అతణ్ణి ఎలాగైనా పట్టుకోవాలనే ప్రయత్నంలో వున్నాడు నరసయ్యా.

జమీందారు కలకత్తాలో వుండగా అతనికి కామేశ రాసిన వుత్తరం ఒకటి నరసయ్యకి కాయితాలేవో వెతుకుతూ వుండగా దొరికిందే. కొన్ని వస్తువు లేవో ఒకరి దగ్గర తాకట్టు పెట్టినట్టు కామేశ రాసినదాన్నిబట్టి చూచా వాచాయగా తెలుస్తూంది.

ఆ "ఒకరు" తమ దగ్గర ఏమీ లేవన్నారు. ఉన్నట్టుగా ఇంట్లో లెక్కేమీ కనిపించదు.

ఉత్తరం పట్టుకొని కామేశ దగ్గరికి వచ్చేడు నరసయ్యా.

అది దొరికిపోయినందుకు కామేశ చాలా చిరాకుపడ్డాడు. దానికోసం తను చాలా వెతికేడు కాని తనకి దొరకలేదు. ఎప్పుడూ అజాగ్రత్తగా వుండే జమీందారది చించి పారేసే వుంటాడనుకున్నాడు, చించకుండా వున్నందుకు చనిపోయిన మనిషిమీద చాలా విసుక్కొని, దాన్ని వెతికి సం పాదించిన నరసయ్యని చాలా తిట్టుకున్నాడు.

ఏమంటావని అడిగేడు నరసయ్య.

వెంకటావ్రుని దగా చేస్తున్నందుకు నీ మీద క్రిమినల్ కేసు ఎందుకు పెట్టకూడదని అడిగి భయపెట్టేడు.

బెదిరింపులకి భయపడడు కామేశ.

ఆ ఉత్తరం తనమీద నేరం మోపడానికి తగినంత ఆధారం కాదని కామేశకి తెలుసు.

అయినప్పటికీ తను కొంతయినా అల్లర పడవలసి వస్తుంది.

ఎంత నిబ్బరంగా వున్నా కోర్టు ఎక్కిన తరువాత ఏది ఎలా జరుగుతుందో చెప్పడం కష్టం.

కామేశ కొంతగా ఆలోచించేడు.

ఆలోచించాక, లాభంలో కొంతభాగం వదులుకుందామనే నిశ్చయానికి వచ్చేడు.

నరసయ్యకి పరిస్థితులన్నీ బోధపర్చేడు.

"నగలన్నీ మిగుల్తాయనే విషయం పైకి తెచ్చినా వెంకటావ్రుకి మిగిలేదేమీ వుండదు. యీ సొమ్ముకూడా అప్పుల తీర్మానం కింద తప్పక పోతుంది. అందుచేత ఈ విషయం ప్రకటించి ప్రయోజనం లేదు. సొమ్మంతా వెంకటావ్రుకే ఇద్దామంటే మూణ్ణెళ్ళలో అంతా ఎగరగొట్టేస్తాడతను. ఇంగితజ్ఞానం అతని కేమీ లేదు. అందులో ఆ తండ్రి కొడుకే అతను. మీరు ఇన్నాళ్ళు దూరంగా ఉన్నారు కాబట్టి ఏ సంగతీ మీ కెరగరు. అంతగా మీరు వెంకటావ్రుని బాగుచేద్దామనేవుంటే అతనికి మీఅమ్మాయిని ఇచ్చినప్పుడు అప్పుడే ఈ సొమ్ము అతనికి ముట్టజెప్పవచ్చును. అలా చేస్తే శ్రేష్ఠంగా ఉంటుందని నా అభిప్రాయం" — అని ఈ రీతిగా చెప్పేడు నరసయ్యతో కామేశ.

కామేశ చెప్పినదాంట్లో నిజం లేకపోలేదని తోచింది నరసయ్యకి.

నరసయ్యకి డబ్బంటే ఆశ లేకపోలేదని కామేశకి ఆదినుండీ తెలుసు.

దాన్తో ఇద్దరూ బేరానికి దిగేరు.

అది వెంటనే కుదర్లేదు. ఇద్దరూ చాలా లజుగుజులు పడ్డారు. కొన్ని దినాలు ఒకరితో ఒకరు మాట్లాడుకోడం మానేశారు కూడా. కాని, ఆలశ్యం అయిపోయితే ఎవరికీ మంచిది కాదని గ్రహించి చివరికొక సమాధానానికి వచ్చేరు.

చెరిసగం వాటాకి బేరం కుదిరింది.

పాతిక వేలలో చెరిసగం యిద్దరూ చేజిక్కించుకున్నారు.

జరుగుతూన్న దేమిటో ఏమీ తెలియని వెంకట్రావు మరోలోకంలో ఉన్నాడు.

నరసయ్య రావడంతో వెంకట్రావుకి ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. చాలా నిబ్బరంగా తిరిగేడు. చాలా సంతోషంగా ఉన్నాడు. మేనమామ అవడంచేతనే కాకుండా, ఆ దశలో సహాయం చెయ్యడానికి వచ్చినందువల్ల నరసయ్యయందతనికి విపరీతమైన అభిమానం కలిగింది. నరసయ్య తనతో శాంతమ్మని కూడా తీసుకువచ్చేడు. పన్నెండేళ్ళ వయసే అయినా శాంతమ్మకి వయసుకి తగని ఊహాలున్నాయి. ఆమె వెంకట్రావుని అంతవరకూ ఎప్పుడూ చూడలేదు. బావని చూద్దామనే ఉబలాటంతో పట్టుబట్టి తండ్రి వెనకాతల వచ్చింది. ఆ వయసులో ఆడపిల్లల కుండే జ్ఞానంతో అజ్ఞానంతో "వెంకట్రావుని తప్ప ఇంకెవర్నీ పెళ్ళి చేసుకోను" అనుకొన్నాడామె.

వెంకట్రావుకి పద్దెనిమి దేళ్ళున్నాయి. ఆడదంటే ఏమిటో అత నెరుగును. మరదలు గట్టిదనీ, గడుసుదనీ, కొంత అమాయకత్వం లేకపోలేదనీ, మొత్తానికి మంచి పిల్లే అనీ ఆమెని చూడగానే గ్రహించేడు. ఈడొచ్చే సరికి చాలా అందంగా ఉండే సూచనలన్నీ ఆమెలో ఉన్నాయి. ఆమెకి తనయందున్న అభిమానం తెలుస్తూనే ఉంది. తనకి స్వయం మేనమామ కూతురు.

ఇంకేం కావాలనుకున్నాడు వెంకట్రావు. ఈ పిల్లని తప్పక పెళ్ళాడుతాననుకున్నాడు. ఆ పిల్లని రోజూ తన వెనక తిప్పుకొనేవాడు. ఆమె అతనికి ఎంత చాకిరీ అయినా చేసేది. చాకిరీ చేస్తూ కబుర్లు చెప్పేది. కబుర్లు చెపుతూ నవ్వేది. నవ్వుతూ అతణ్ణి నవ్వించేది.

వెంకట్రావు పాట బాగా పాడతాడు. శాంతమ్మ అతణ్ణి పాడమని బలవంత పెట్టేది. "నాటకాల్లో వాళ్ళల్లాగ ఎంతో బాగా పాడతావు నువ్వు" అంటూ ఉండేది. అలా పొగడుతూ ఉంటే వెంకట్రావుకి చెప్పలేనంత గర్వంగా ఆనందంగా ఉండేది. ఒకప్పుడు ఉత్సాహం పట్టలేక ఆమెని ఎత్తుకొని గిర్రున తిప్పేవాడు. ఒంటరిగా ఉన్నప్పుడల్లా ఆమెని ముద్దులాడేవాడు. అందుకోసం ఆమె అతను ఒంటరిగా ఉన్నప్పుడల్లా వచ్చేది. అతను ముద్దు పెట్టుకున్నప్పుడు ఏదో తెలియని ఆవేశంతో ఆమె ఒళ్ళంతా వణికేది. అతని ఒళ్ళో కూర్చున్నప్పుడల్లా తమ ఇంట్లో పడగ్గదిలో ఉండే రాధాకృష్ణుల పటం ఆమె కళ్ళ ముందు మెరిసేది. బొమ్మలో కృష్ణుడి చుట్టూ రాధ చేతులు వేసినట్టు వేద్దామనుకుంటే చేతులు అందేవి కావు ఆమెకు. బొమ్మ సంగతి ఓనాడు వెంకట్రావుతో చెప్తే అతను తెగనవ్వి, "నువ్వెన్నటికీ రాధవు కాలేవు" అని వెక్కిరించేడు. వెక్కిరించి ఆమె చుట్టూ చేతులు వేసేడు. అతని చేతుల్లో నలిగిపోతూ ఉంటే కలిగిన సుఖంతో ఆమె వివశురాలయి పోయేది. అలా అతని ఒళ్ళో కూర్చోడం తప్పనుకోలేదామె. తనలో యౌవ్వనం అప్పుడే మొగ్గతొడుగుతోందని ఎరగదామె. అర్థం కాని ఆనందంతో అతణ్ణి కౌగలించుకొనేదామె.

ఒకనాడు చీకటి పడ్డాక వెంకట్రావు మామూలుగా ఇంటికి వచ్చి "శాంతా, శాంతా" అని పిల్చేడు.

దీపాల్లేని చీకట్లో అతని పిలుపుకి ఆ విశాలభవనం మూల్గింది.

చీకట్లో సావిత్రి మరో గదిలోంచి రావడం అతను చూడనేలేదు.

"మరేమో వచ్చి, శాంతా, మావయ్యా వెళ్ళిపోయేరన్నయ్యా" అన్నాది సావిత్రి వెక్కుతూ వెక్కుతూ.

"ఎక్కడికి వెళ్లేరు?"

"వాళ్ళింటికి వెళ్ళిపోయేరన్నయ్యా!"

"మళ్లీ ఎప్పుడొస్తామన్నారు?"

"మరేమో ఒచ్చి, సామానంతా పట్టుకుపోయేరన్నయ్యా! కామేశం తాత, మరేమో ఒచ్చి, మీ మాంవయ్య మళ్లీ రాడులే" అన్నాడన్నయ్యా!"

ఆరోజు ఆకాశాన్ని నల్లటి మేఘుం ఆలుముకొంది. ఇల్లంతా అంధకారంలో మునిగి ఉంది. కిటికీల్లోంచి గుమ్మాల్లోంచి ఈదురుగాలి హోరుమని వీస్తోంది. తలుపులన్నీ గాలికి టకటక కొట్టుకొంటున్నాయి. మబ్బు కమ్మిన చీకట్లో, గాలి జోరుగా ఉన్న సమయంలో, ఆరిన దీపాలతో ఒంటరిగా ఉన్న ఆ సౌధం భయంకరంగా ఉంది. పెనుభూతంలా ఉంది.

వెంకటాద్రిని అంతుకాని ఆవేదన అంధకారంలా కప్పేసింది. ఎంత ఆపుదామనుకున్నా అతని పెదవులు కంపించేయి. విప్పారిన అతని ఎర్రటి కళ్ళని కన్నీరు నింపేసింది. ద్వారబంధం పట్టుకొని కొంతసేపు అలానే నిల్చుండిపోయేడు.

'నాతో చెప్పకుండా వెళిపోయిన మామయ్యా, శాంతమ్మా నాకు మరి కనిపించరు' అనిపించిందతనికి.

మరింక రారు వాళ్ళు,

మరింక చూసేవాళ్ళు లేరు నన్ను,

అని ఎందుకో గాని తోచింది వెంకటాద్రికి.

అకస్మాత్తుగా అగాధంలో పడినట్టయింది.

అండగా నిల్చున్న కొండ ఎందుకో గాని అకస్మాత్తుగా బుద్ధి మార్చుకొని ఆశ్చర్యంగా, నడుచుకొంటూ పోయింది, ఎక్కడికో.

కొండతోటే వచ్చి కొండవారని పుష్పిస్తూన్న లేతమామిడిమొక్క కొండతోటే మాయమయింది.

అగాధంలో అకస్మాత్తుగా పడిన వెంకటార్రావు ఆ రాత్రంతా అతి బాధతో కొట్టుకున్నాడు.

ఆ రాత్రి తెల్లవారింది.

అలాగే తెల్లవారడం, రాత్రి రావడం జరిగింది.

అలాగే తొమ్మిది నెలలు జరిగేయి.

తొమ్మిదో నెల జరగకుండానే వెంకటార్రావు తల్లి అతని తండ్రికోసం పోయింది.

పదో నెల రాగానే వెంకటార్రావు ఫకీరయి నడిరోడ్డుమీద నిల్చోవలసి వచ్చింది.

ఈలోపున అనేకమంది అనేక భోగట్టాలు వెంకట్రావు చెవిని వేశారు.

"కామేశా, నరసయ్యా కలిసి నీకు చాలా ద్రోహం చేశారుస్మా" అని అనేకమంది అతన్తో అన్నారు ఆ మాట మొదటిసారి విన్నప్పుడు చాలా "షాక్" అయేడు వెంకటార్రావు. నమ్మలేదామాట మొదట్లో. కాని అన్ని తార్కాణాలు అంతమంది చూపించి చెప్తున్నప్పుడు నమ్మలేకుండా ఉండలేకపోయాడు.

దుఃఖం, భయం, దారిద్ర్యం.

దారిద్ర్యం వల్ల ఆకలి, ఆకలితో ఉండిపోవాలేమోనన్న భయం, తల్లి దండ్రిలు పోయారన్న దుఃఖం, నా దుఃఖంలో నాక్కావలసినవాళ్ళే నాకు ద్రోహం చేశారే అన్న పరమకోపం, ఎదురుగా వికృతంగా నిల్చున్న ఘోరమైన దారిద్ర్యం, భయం, కోపం, దుఃఖం, దారిద్ర్యం.

అన్నీ కలిసి వెంకట్రావులో విపరీతమైన మార్పు తెచ్చేయి.

పద్దెనిమిది సంవత్సరాలు నిండిన ప్రాయం అతన్ది.

నిండు యౌవ్వనంలో ఉన్నాడు.

కాని ఒక్క సారిగా ఒక్క రోజున, ఒక్క క్షణంలో, నిండు యవ్వనం లో ఉండే ఆశలు, నిరాశలు, ఊహలు, కలలు, కోర్కెలు అన్నీ అతన్లో అణగారిపోయేయి. అణగార్చుకున్నా డతను.

లోకానికి దయలేదు ; దాక్షిణ్యం లేదు ; విశ్వాసం లేదు ; స్నేహం లేదు; ప్రేమ లేదు; అభిమానం లేదు ; కనికరం లేదు; కారుణ్యం లేదు; ఇవన్నీ ఉన్నాయని నమ్మి ప్రయోజనం లేదు; మానవలోకం అనే ఈ మార్కెట్టులో ఎవడి జాగ్రత్తమీద వాడుండాలి; ఎవడి లాభం వాడు చూసు కోవాలి; అవతలవాడి లాభన ష్టాల్లో కష్టసుఖాల్లో ఇవతలవాడికి సంబంధం లేదు; ఎవడి కష్టం వాడు మాన్పుకోవాలి; ఎవడి సుఖం వాడు చూసుకో వాలి; "బహుపరాగ్గా ఉండాలి ప్రపంచంలో, ఈ అడివిలో ఏది తాడో ఏది పామో తెలుసుకోడం కష్టం; తరచుగా తాడే పామవుతుంది; పామయి కరుస్తుంది. కరవకుండా కాపాడుకోవాలి ; అవసర మొస్తే మనమే ముందు కరవాలి;

అనుకొని వెంకటావ్రు గుండె రాయి చేసుకున్నాడు.

సిగ్గూ, లజ్జా విడిచిపెట్టేశాడు. మొండికవచం తొడిగేడు. స్వలా భం అనే జండా ఎత్తేడు. జీవితం అనే యుద్ధంలో దిగేడు.

పద్దెనిమిదేళ్ళ క్రితం ఎండ వేడిలో నడివీధిలో నిల్చున్న వెంకటావ్రి విప్పా డొక కంట్రాక్టరు.

వెంకటావ్రు మసిపూసి మారేడుకాయ చెయ్యడం నేర్చుకున్నాడు.

అతనంటే అనేకమందికి భయం. అనేకమందికి ద్వేషం.

వెంకటావ్రు అలాగే పడిపోయి లేచేడు,

లేస్తూ పడుతూ లేస్తూ వస్తున్నాడు.

పడినా లేచినా మనసుకి పట్టించుకోడం లేదు.

వేసవికాలంలో ఒకరోజు ఉదయం సరిగా ఏడు గంటలకే సుబ్బయ్య ఇంటికి వచ్చేడు వెంకటావ్రు.

# 3

ఆ ఉదయం ఏడు గంటలకి వెంకట్రావు రాగానే సుబ్బయ్య చాలా కంగారు పడ్డాడు.

అతణ్ణి లోనికి తీసుకువెళ్లి ఉన్న కుర్చీలో అతణ్ణి కూర్చోబెట్టి తను కిటికీలో కూర్చున్నాడు సుబ్బయ్య.

సావిత్రి తెచ్చిన కాఫీ తాగుతున్నాడు వెంకట్రావు, ఏదో ఆలోచిస్తూ.

"ఏమిటోయ్, ఇలా వచ్చేవు?" అనడిగేడు సుబ్బయ్య.

"అర్జంటుగా ఓ అయిదు వందలు కావాలోయ్" అన్నాడు వెంకట్రావు ఒక్కసారిగా.

"ఆహాఁ!?"

తన వ్యాపార విషయంగాని మరేవిషయంగాని వెంకట్రావు సుబ్బయ్యతో ఎన్నడూ ప్రస్తావించలేదు. ఆ రోజున డబ్బు గురించి ప్రస్తావన తనతో తెచ్చినందుకు సుబ్బయ్య చాలా మురిసిపోయేడు.

ఎందుక్కావాలో అడుగుదామనుకొని, వెంకట్రావుకి కోపం వస్తుందేమోనని అడగడం మానేశాడు.

పాపం! ఎందుకో ఒకందుకు కావలసి వుంటుంది.

"అందు గురించి నువ్వు నాకొంచెం సాయం చెయ్యాలి" అన్నాడు వెంకట్రావు.

నన్ను కాని ఇమ్మంటాడా ఏమిటి?

నా దగ్గర పదిహేను రూపాయలు తప్ప ఇంకేమీ లేదే!

లేదని ఇప్పుడు ఇతన్తో ఎలా చెప్పడం?

సుబ్బయ్య ఏమంటాడో అని ఎదురు చూడలేదు వెంకట్రావు.

"నీ దగ్గిర అయిదు వంద లుంటాయని కాలేదుస్మా" అన్నాడు కాఫీ గ్లాసు మేజా మీద పెడుతూ.

"బతికేనార్రి బాబూ" అనుకున్నాడు సుబ్బయ్యా.

డబ్బు లేదన్న భోగట్టా షావుకారిదికి తెలిసిపోయిందని బాధ పడలేదు.

"అవునవును! నీకు మాత్రం తెలీదూ? అంత సొమ్ము నా దగ్గ రెక్క డుంటుంది చెప్పూ"

"అవును నీ దగ్గర లేదు. కాని నాక్కావాలి" అన్నాడు వెంకట్రావు మేజా మీద గుడ్డ సవరిస్తూ.

"అయితే ఏం చేద్దాం అంటావు?"

"ఇదిగో చెప్తా".

వెంకట్రావు చుట్ట తీసి ముట్టించేడు. ముట్టించేక

"గవరయ్యాని ఎరుగుదువు కదా?" అన్నాడు.

"ఎరక్కేమీ! ఆయన 'బిల్స'న్నీ నా దగ్గిరే ఉన్నాయి" అన్నాడు సుబ్బయ్యా.

"వాణ్ణి అయిదు వంద లడుగు"

అంత సులభంగా అనేశాడు వెంకట్రావు.

"నే నే! ఆయన్ని అయిదు వంద లడగడమే!"

సుబ్బయ్యా నిర్ఘాంతపోయేడు.

"ఎందుకల్లా బెదురుతావ్? వాణ్ణేం ఖూనీ చెయ్యమనడం లేదే — చేసినా పాపం లేదనుకో — వాణ్ణి అయిదువంద లడగమన్నాను అంతేనా?"

సుబ్బయ్యా కొంచెం తెప్పరిల్లేడు.

"నే నడుగుతే ఆయ నిస్తాడా? వట్టి మాట:"

"నా కోసం అని తెలిస్తే అసలే ఇవ్వడు. అందు చేత నువ్వే నీకోస మని అడగాలి" అన్నాడు వెంకట్రావు చుట్టపొగ వదుల్తూ.

"కూరల మనిషి ఉల్లిపాయలైనా అరువివ్వదు కదా నాకు! అటువంటిది అయిదు వందలు నాకిస్తాడా ఆయన!"

"అబ్బ! నువ్వెప్పుడూ ఇంతేనోయ్! 'నే వొట్టి చచ్చు పెద్దమ్మనం డోయ్' అని నువ్వే అంటూ ఉంటే కాదు. నువ్వు దేవేంద్రుడి వని పైవాళ్లు నువ్వడిగిందల్లా ఇస్తారా? కొంచెం బిరుసుగా మాట్లాడ్డం నేర్చుకో బావా"

"పోనీ నన్నిలా ఇలా ఉండనివ్వూ"

"ఉండనిచ్చే దేమిటి, ఉంటూనే ఉన్నావు ... అయినా ఇప్పుడు నాకు అవసరం వచ్చింది. డబ్బు జరుగుడుగా ఉంది ... అందుచేత నీ నంగిరి పింగిరి మాటలు మాని నే చెప్పినట్టు చెయ్యి ... ఏం, ఏమంటావ్?"

'ఏమంటావ్' అని వెంకటార్రావు అడుగుతూండగానే కాఫీ గ్లాసులు పట్టుకుపోడానికి సావిత్రి వచ్చింది.

గ్లాసులు మెల్లిగా తీస్తూ అన్న వేసిన ప్రశ్నకి సుబ్బయ్య ఏమంటాడో అని ఎదురు చూస్తోంది,

ఆమె తన జవాబుకోసం అక్కడే నిల్చున్నాదని సుబ్బయ్యా గమనించేడు.

"ఏమంటావోయ్" అని అడిగేడు వెంకటార్రావు మళ్ళీ.

సావిత్రి ఇంకా గదిలోనే ఉంది.

"నన్నేం చెయ్యమంటావో ఏమిటో? మరంతా నువ్వే చెప్పాలి" అన్నాడు సుబ్బయ్యా సావిత్రి వైపు చూడకుండా.

గ్లాసులు పట్టుకొని గదిలోంచి వెళ్లిపోయింది సావిత్రి.

"ధైర్యంగా నువ్వుంటే నేనేమీ చెప్పనక్కర్లేదు. అంతా నువ్వే చెయ్యగలవ్" అన్నాడు వెంకటార్రావు.

సుబ్బయ్యా మనసంతా భారంగా ఉన్నాది.

"నన్నేం చెయ్యమంటావో చెప్పు"

"నిన్నేం బ్రహ్మాండం బద్దలుకొట్టమన్లేదోయ్, భగవంతుడా! ఎందుకలా అప్పుడే గుడికెళ్ళే మేకపోతులా భయపడుతున్నావ్"

"నేనేం భయపడ్డం లేదోయ్. కాని, ముందు ఏం చెయ్యాలో చెప్పు"

నిజంగా సుబ్బయ్యా మనసు కలతగా ఉంది.

"ఏమీ లేదు! ... గవరయ్య ఈమధ్య నీదగ్గరకి వస్తున్నాడు కదా!"

"ప్రతిరోజూ ఒస్తున్నాడు"

"అవునా మరి... ఈసారి వచ్చినప్పుడు వాణ్ణి కొంచం ఎడంగా తీసుకువెళ్ళి 'ఓయ్ గవరయ్యా! నాకో అయిదు వందలు అర్జంటుగా కావాలి సాయంకాలం లోపున నువ్వెలాగయినా సదుపాయం చెయ్యాలి' అని సరిగ్గా ఈ మాటలే వాడితో అను. సాయంత్రం ఆరోగంటకల్లా సొమ్ము నీచేతుల్లో ఉండకపోతే చెవి కోయించుకుపోతాను"

"అలా అడగుతే ఇస్తాడంటావా ఆయన?"

వెంకట్రావుకి అమాంతంగా కోపం వచ్చింది.

"ఆయన! ఆయన! ఆయన! ఎందుకలా ఆవెధవని "ఆయ"న్ని చేస్తావ్! ఒట్టి బంట్రోతు వెధవ్వాడు! నా ముందెప్పుడూ వాణ్ణలా 'రెఫర్' చెయ్యకు'

గవరయ్య బంట్రోతు వెధవకాడే!

పెద్ద కంట్రాక్టరు.

"ఆయన" అంటే తప్పేముంది?

బంట్రోతే అనుకోండి.

"ఆయన" అంటే తప్పా?

ఎవరి గొప్ప వారిదే.

అయినా, నేనో నౌఖరీ వెధవని కాబట్టి అలా అంటున్నేను.

వెంకట్రావు జమీందారు! నాకూ ఇతనికీ హస్తిమశకాంతరం ఉంది.

నేనైతే "గవరయ్యగారూ" అంటానుగాని, వెంకట్రావలా అంటాడా?

వెంకట్రావుకి కోపం రావడం సహజమే.

"పోనీలేవోయ్! అలాగే అడుగుతాలే అతగాణ్ణి" అన్నాడు సుబ్బయ్య.

కోపం చల్లార్చుకొందికి ఆరిపోయిన చుట్టని అంటించేడు వెంకట్రావు.

కొంతసేపు అతను మాట్లాడకపోడం చూసి సుబ్బయ్య ఓ చిన్న ప్రశ్న వేసేడు.

"సొమ్మెందుకని అతనడుగుతే?"

ప్రతి అక్షరం తుంచి చెప్పేడు వెంకట్రావు.

"అ, క్క, ర, డు."

సుబ్బయ్య కొంచెంసేపు ఊరుకొని మళ్ళీ అడిగేడు.

"సొమ్ము మళ్ళీ ఎప్పుడిస్తావని అడుగుతే?"

"అలాకూడా అడగడు"

వెంకటాద్రివులో కోపచిహ్నాలు మళ్ళీ కనిపించేయి.

"సరే సరే" అన్నాడు సుబ్బయ్య.

"నే చెప్పినట్లు చెయ్. చేస్తే డబ్బు వాడు తప్పకుండా ఇస్తాడు ... నే వస్తామరి" అంటూ వెంకటాద్రివు లేచేడు.

కిటికీలోంచి సుబ్బయ్య కిందకి దిగేడు.

సావిత్రి గదిలోనికి వచ్చింది.

"ఏం చెల్లీ, పిల్లలూ వాళ్ళూ కులాసాగా ఉన్నారా?" అని సావిత్రి నడిగి, ఆమె జవాబు కోసం ఆగకుండా సుబ్బయ్య వైపు తిరిగి అన్నాడు వెంకటాద్రివు.

"నే చెప్పింది జ్ఞాపకం ఉంచుకో! డబ్బు నీకే కావాలని అడుగు. నా పేరయినా ఎత్తకు. ఏం?"

"సరే" అన్నాడు సుబ్బయ్య.

"అయితే, సాయంత్రం మళ్ళీ వస్తా" అంటూ తొందరగా వెళిపోయేడు వెంకటాద్రివు.

అతను వెళ్ళేక సుబ్బయ్యా సావిత్రీ ఓ రెండు నిమిషాలు అలా నిల్చున్నారు.

"రాక రాక వచ్చేడు మా అన్నయ్య" అన్నాది సావిత్రి ఎవరితోనో అన్నట్టుగా.

రాక రాక మా అన్నయ్యలాంటి ఘనమైన వ్యక్తివస్తే అతను చెప్పినదేదో చెయ్యక అడ్డ ప్రశ్నలు వేసి అతణ్ణి చిరాకు పెడతారా, అని ఆమె అభిప్రాయం.

ఆమె ఉద్దేశం సుబ్బయ్య గ్రహించలేకపోలేదు.

"అవును. పాపం, ఆతనికి ఊపిరి తిరక్కుండా పన్లు"

అన్నాడు పైకి.

సావిత్రి మరో గదిలోకి పోయింది.

వెంకటాద్రివు వీధి వైపు వచ్చేడు.

వెంకట్రావు వచ్చి "ఇలా చెయ్యి, అలా అడుగు" అంటే తల ఊపే వాడేగాని ఆ ఉదయం అంతా సుబ్బయ్య గాభరాగా ఉన్నాడు.

చేతిలో సొమ్ము లేకపోయినా ఎలాగో ఓలాగ కాలక్షేపం చెయ్యడమే గాని ఎవర్నయినా నోరు విడచి అడగడం సుబ్బయ్యకి అలవాటు లేదు.

నిజంగా తనకే అవసరం ఉన్నట్లయితే గవరయ్యని అడుగుదామనే ఆలోచనైనా అతనికి తట్టకపోను. తట్టినా, గవరయ్యని అడుగుదామనే నిశ్చయానికి రాలేకపోను.

వెంకట్రావు కోసం అడగదల్చుకున్నాడు.

అడుగుతానని మాట అనేశాడు.

మాట అనేశానే గాని ఆ గవరయ్యని అడగ్గలనా ?

వెంకట్రావు కోసం అని చెప్తే గవరయ్య అసలే ఇవ్వడు !

సొమ్ము నాకే కావాలని అబద్ధం ఆడాలి !

ఎలాగ ?

ఆందోళనతో సుబ్బయ్య కారోజు ఆఫీసుకి వెళ్ళేముందు ఆకలి వెయ్యలేదు. కొంచెం మజ్జిగా అన్నం మాత్రం తిన్నాడు.

ఆఫీసుకి నడుస్తూ ఆలోచిస్తూనే ఉన్నాడు.

పాపం! వెంకట్రావుకి సొమ్ము ఎంత జరూరుగా ఉందో ఏమిటో !

లేకపోతే అంత పొద్దుటే అలా వస్తాడా ?

దేహీ అని అడుగుతాడా ?

ఎంతటివాడికి ఎంత గతి పట్టింది!

వాళ్ళ నాయనా, తాతా ఎంత గొప్పగా, ఎంత దర్జాగా బ్రతికేరు!

ఏ కాలానికి ఏ దెలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు !

ఈ రోజు నేను అయిదు వంద లడగబోతానని నిన్న అనుకున్నానా?

నేను అడగబోతున్నానని గవరయ్య అనుకుంటాడా ?

గవరయ్య ఇవాళ వచ్చినప్పుడు...

వస్తాడని నిర్ధారణ ఏముంది ?

గవరయ్య ఈరోజు రాకపోవచ్చు.

అమ్మో! గవరయ్య ఇవాళ రాకపోతే ఎలా ?

వెంకటాద్రివు సాయంకాలం గంపెడాశతో వస్తాడే!

గవరయ్య రావాలి, దేవా, రావాలి!

అనుకొంటూ, తొందరగా, మెల్లగా తొందరగా నడుస్తూ ఆఫీసుకి వెళ్ళేడు సుబ్బయ్య.

ఆఫీసులో కూర్చున్నాడేగాని, ఆఫీసు పనిమీద అతని దృష్టిలేదు.

మాటిమాటికీ గేటువైపు చూస్తున్నాడు.

రోజూ సరిగ్గా పన్నెండుగంటలయే సరికల్లా గవరయ్య తన ఎర్రి కార్లో కూర్చొని రావడం, ఆఫీసులో అందర్నీ పలకరించడం, హెడ్‌గుమస్తాతో లోకాభిరామాయణం చెప్పడం, తన "బిల్స్" గురించి ముచ్చటించడం, తరువాత అందరితో చెప్పివెళ్ళి పోడం మామూలు.

ఆఫీసులో కూర్చుని గేటువైపూ, గడియారంవైపూ చూస్తున్నాడు సుబ్బయ్య.

పదకొండు గంటలయింది.

పావయింది. అర్ధయింది.

ముప్పావయింది.

ఒకటీ, రెండు, మూడూ...

వరసగా పదిహేన్నిమిషాలు పరుగున పోయేయి.

ఠంగ్. ఠంగ్. ఠంగ్...

వరసగా పన్నెండు గంటలు

వచ్చేసమయం. గవరయ్య వచ్చేసమయం వస్తోంది

సుబ్బయ్య వళ్ళు వేడెక్కుతోంది.

పన్నెండు దాటి అయిదు నిమిషాలయింది.

ఆఫీసు గేటుదగ్గిర జుర్రుమని చప్పుడు అయి ఆగింది.

ఆగిన కొన్ని సెకెండ్లలో, కారు తలుపు టక్కునవేసిన కొన్ని సెకెండ్లలో,

"నమస్కారాలండోయ్"

అంటూ ఆఫీసు గదిలోకి వచ్చేడు.

గవరయ్య!!

"రాజా వెడాలి వచ్చె సభకు"

అన్నట్టుగా ఆఫీసుకి వచ్చేడు గవరయ్య.

గవరయ్య చాలా గంభీరంగా ఉంటాడు. అతని వయసు నలభై దాటింది. మనిషి చాలా ఎర్రిగా ఉంటాడు. అతని తలకి చుట్టూ జుత్తు ఉంటుంది. మధ్యది నున్నటి బట్టతల. నల్లగా చాలా నల్లగా దట్టంగా ఉండే మీసం అతన్ది తళతళలాడే బంగారపు "ఫ్రేం" కళ్ళద్దాలు పెట్టు కుంటాడు. రాగి చెంబుకి మీసాలూ, కళ్ళజోడూ పెట్టినట్లుంటుంది అతని ముఖం. చాలా వెడల్పయిన మనిషతను. ఎద్దు మూపుల్లాంటి మూపులు అతనివి. అతను చాలా పొడవుగా ఉంటాడు. చాలా బలంగా ఉంటాడు. అతను చాలా హెచ్చుగా నవ్వుతూ ఉంటాడు. ఆ నవ్వు ఒకప్పుడు గాడిద ఓండ్రపెట్టినట్లుంటుంది. ఇంకొకప్పుడు కోతి కిచకిచలాడినట్లు అనిపిస్తుంది. ఏరీతిగా నవ్వినా కూడా, రాగిచెంబులా ఉండే అతని ముఖం బాగా తోమిన రాగిచెంబులా ఇంకా ఎర్రబడుతుంది. అతను అందరితోనూ చనవుగా మాట్లాడగలడు. చాలా సరదాగా ఉండగలడు. అవసరంవస్తే అతి భయం కరుడవగలడు.

మొత్తానికి, గవరయ్య చాలా గంభీరంగా ఉంటాడు. చిన్నతనంలో చాలా బీదగా ఉండేవాడు గవరయ్య. అతని తండ్రి రంగూన్ పోయి మరి తిరిగి రాలేదు. తల్లి గంగమ్మ అతణ్ణి పోషించుకొంటూ వచ్చింది. ఆమె వ్యభి చరించి డబ్బు గణించిందని అనేవారు. ఏరీతిగా గణించినా, గణన మాత్రం చాలా తక్కువ. తక్కువయినా, కొడుక్కి ఏలోటూ రానివ్వకూడదని గంగమ్మ అనుకొనేది. ఆమె చాలా కష్టపడి కొడుకుని చదివించింది. కాని గవరయ్యకి చదువు సరిగా అబ్బలేదు. పదిహేనోయేట అతను 'ఘస్టుఫారం' లో ప్రవేశించేడు. ఆయేడే రామయ్యమ్మనే పదేళ్ళపిల్లని తెచ్చి కొడుక్కి ఇచ్చి ముచ్చటగా పెళ్ళిచేసింది గంగమ్మ. పదేళ్ళప్పుడు కూడా రామయ్య మ్మ ముత్యంలా మెరిసిపోయేది. "ఎవరమ్మా ఆపిల్ల ?" అని ఎంతోమంది ఆమెనిచూడగానే అడిగేవారు. కోడల్ని చూచి గంగమ్మ ఎంత మురిసి

పోయేదో గవరయ్య కూడా అంత మురిసిపోయేవాడు. పెళ్ళయిన వెంటనే తన ఇంటికి కోడల్ని తీసుకు వచ్చింది గంగమ్మ.

గవరయ్య మెల్లిగా నాలుగో ఫారంలోకి వచ్చేసరికి అతనికి పంధొమ్మిదో సంవత్సరం వచ్చింది. రామయ్యమ్మకి ఈడు వచ్చింది. ఇద్దరికీ పునస్సంధానం జరిగింది. పెళ్ళాం అనే మనిషి అంత సుఖం ఇవ్వగలదని గవరయ్య అంతకుముందు అనుకోలేదు. భార్యతో గదిలో ఉన్నప్పుడు స్వర్గంలో ఉన్నట్టే అనిపించేదతనికి. ఆమెయందు అనురాగం, అదివరకట్లంటె వేయిరెట్లు హెచ్చయిందతనికి. వీలయినదప్పుడల్లా ఆమెతో గదిలోనే ఉండేవాడతను. ఆరోజుల్లో కూడా అతను చాలా మోటుగా ఉండేవాడు. రామయ్యమ్మని గాఢంగా ప్రేమించి, మోటుగా లాలించి, అమితమైన ఆనందాన్ని పొందేవాడతను.

అంతా బాగానే ఉంటూ ఉండగా, ఆమెకి ఇంకా బతకాలనే ఉంటూ ఉండగా గంగమ్మ చనిపోయింది. గవరయ్య చాలా దుఃఖించేడు. ఆడదాన్లా ఏడ్చేడు తల్లికోసం.

గంగమ్మ చనిపోయింది.

గవరయ్య గంగలో పడ్డట్టు అయేడు.

అంతవరకూ సాఫీగా వెళ్తూన్న అతని జీవితం ఒడుదుడుకుల్లో పడ్డాది.

ఇంట్లో చూస్తే కాణీ లేదు. చేతిలో చూస్తే అంతకన్న హెచ్చు లేదు. చదువు చూస్తే అబ్బలేదు.

నౌకరీ చూసుకోడమో, కిళ్లీ దుకాణం పెట్టుకోడమో చెయ్యాలనుకున్నాడు గవరయ్య.

గవరయ్యకి నూకరాజనే పేరుగల ప్రాణస్నేహితుడు ఉండేవాడు.

నూకరాజు మూడో ఫారంవరకూ చదివేసి, చదువుకి స్వస్తి చెప్పి తాలూకా ఆఫీసులో బంట్రోతుగా ప్రవేశించేడు. నూకరాజూ గవరయ్యా చిన్నప్పటినుంచీ స్నేహితులు. వాళ్ల ఇళ్ళు కూడా అట్టే దూరంలో లేవు. వయసులో గవరయ్యకన్న నూకరాజు పెద్ద. గవరయ్యకంటె గడుసువాడూ, లోకజ్ఞానం ఉన్నవాడూ కూడా. గవరయ్య ఎప్డు మొద్దులా ఉండేవాడు. ప్రపంచం

లో దేనిగురించీకూడా ఆరోజుల్లో అతనికి బాగా తెలియదు. "నూకరాజు నాలాకాదు. తెలివైనవాడు, ఖతక నేర్చినవాడు" అనుకొనేవాడు గవరయ్య.

నూకరాజు ఓరోజు గవరయ్య ఇంటికి వచ్చి "ఒరేఅబ్బాయ్! మా ఆఫీసులో అటెండరు పని ఖాళీగా ఉంది. నువ్వొస్తావా?" అని గవరయ్యని అడిగేడు.

"ఖాళీగా ఉంటేవచ్చుగాని ఆ ఉద్యోగం నాకెవడిస్తాడ్రా!" అన్నాడు గవరయ్య.

"నేనున్నానుగదట్రా ముందు నువ్వు కాయితం పెట్టు మిగతాదంతా నేచూస్తా" అని ఆసరా ఇచ్చేడు నూకరాజు.

గవరయ్య దరఖాస్తు పెట్టేడు

అటెండరు ఉద్యోగం అనుకోకుండా వచ్చింది.

వచ్చినరోజున గవరయ్య బ్రహ్మానందభరితుడయ్యేడు.

నూకరాజుని కౌగలించుకున్నాడు.

తనవలనే కార్యం జరిగినందుకు నూకరాజు గర్వంతో పొంగేడు.

గవరయ్య ఉద్యోగంలో ప్రవేశించేడు.

బంట్రోతుపని అట్టే కష్టమనిపించలేదు గవరయ్యకి

అందులోనూ తాశిల్దారు ఆఫీసులో అందరికన్నా మంచివాడవడంచేత గవరయ్యకి ఇబ్బందేమీ లేక పోయింది.

అప్పటి తాశిల్దారు నలభైయేళ్ళ వయసువాడు. అయినా, కుర్రవాడ్లా అవుపించేవాడు. చలాకీగా, హుషార్ గా ఉంటూ, సరదాగా మాట్లాడేవాడు నౌకర్లయందూ గుమాస్తాలయందు దయగలిగిఉండేవాడు. లంచాలు పుచ్చుకోడం అంటే అతనికి కిట్టేదికాదు. అతనియందు గవరయ్యకి చాలా గౌరవం ఉండేది.

ఓరోజు తాశిల్దారు కొనకాతల కాయితాలు పట్టుకొని మరొక ఆఫీసుకి గవరయ్య వెళ్ళవలసి వచ్చింది. ఆదార్లోనే ఉంది గవరయ్య ఇల్లు.

"అదే బాబు మా ఇల్లు" అని తాశిల్దార్ కి గవరయ్య గొప్పగా తన ఇల్లు చూపించేడు.

"ఏది! అదేనా?" అనడిగేడు తాశిల్దారు అటువైపుచూసి.

"చిత్తం" అన్నాడు గవరయ్య ముసిముసిగా నవ్వుతూ.

గవరయ్య ముసిముసిగా నవ్వడానికి కారణం ఆ సమయానికి తల దువ్వుకొంటూ రామయ్యమ్మ కిటికీదగ్గరకి రావడం.

"బావుందిరా! పెంకుటిల్లేగా!" అన్నాడు తాశిల్దారు.

అతనలా అన్నందుకు చాలా గొప్పపడిపోయేడు గవరయ్య.

"ఏదో బాబు. మా అమ్మ కష్టపడి కట్టించింది" అన్నాడు

"ఆహా!" అన్నాడు తాశిల్దారు.

"అవునండి మా అమ్మే కట్టించిందండి" అన్నాడు గవరయ్య మళ్ళీను.

"అయితే ఆ కిటికీ దగ్గర పిల్ల నీ చెల్లెలుటోయ్?" అని అడిగేడు తాశిల్దారు.

"కాదండి, నా ఆడమనిషండి అది" అన్నాడు గవరయ్య సిగ్గుతో.

"చక్కటి చుక్కని సంపాదించేవురా" అన్నాడు తాశిల్దారు.

తాశిల్దారలా అన్నందుకు గవరయ్య చాలా మురిసిపోయేడు.

ఆ రోజు రాత్రి రామయ్యమ్మకి మల్లెపువ్వులు కొని తెచ్చేడు.

ఆ రోజునే అందిన జీతం ఆమె చేతిలో పోసేడు.

సరదాతో ఉద్యోగం చేసేడు గవరయ్య.

సాధారణంగా తాశిల్దారు ఎక్కడకో అక్కడకి తిరుగుతూ ఉండేవాడు. అతన్తో నూకరాజు సాధారణంగా వెళ్ళేవాడు. తాశిల్దారు లేనప్పుడు గుమస్తాలు పడుక్కొనేవారు. అటువంటప్పుడు నూకరాజుకి అట్టే పని ఉండేది కాదు.

తాశిల్దారు ఓ రోజు మధ్యాహ్నం ఆఫీసులో లేడు. గవరయ్యకి ఆ రోజు మధ్యాహ్నం ఎందుకోగాని బాగా ఆకలిగా ఉంది "బాబూ ఇంటికి పోయి భోంచేసి వస్తా" అని హెడ్ క్లార్కుని అడుగు అతను "పొద్దుటెందుకు చెయ్యలేదని" విసుక్కొని చివరకి "సరే పోయిరా వేగిరం" అన్నాడు.

తొందరగా నడుచుకొంటూ ఇంటికి వచ్చేడు.

ఇంటికి వచ్చిన గవరయ్య ఇంటికి రాగానే చాలా ఘోరమైన దృశ్యం చూసేడు.

రామయ్యమ్మ అతణ్ణి చూసి కెవ్వున కేక వేసింది.

భయంతో వికృతంగా మారిన ముఖంతో తాశీల్దారు కూడా మంచం మీంచి లేచేడు.

గవరయ్య ఒళ్లు ఆ దృశ్యం చూడగానే నీరయిపోయింది; గడ్డకట్టి రాయిగా మారిపోయింది; అగ్నిలో దగ్ధమైపోయింది; ఊపిరాడక కొట్టుకు పోయింది.

గవరయ్యకి వంటిమీద తెలివిలేదు.

వెర్రిగా ఎక్కడికో నడుచుకొంటూ పోయేడు.

స్మారకం వచ్చేక సముద్రతీరాన్ని కూర్చొన్నానని తెలుసుకున్నాడు.

అప్పటికి రాత్రి ఏడు గంటలు దాటింది. నల్లగా ఉన్న ఆకాశంలోకి తెల్లగా ఉండే చంద్రుడు రాలేదు, నీలిసముద్రం నీలిరాత్రిలో నీడనీడగా కన్పిస్తూ ఏకరోదన చేస్తోంది భయంకరంగా. మధ్యమధ్య పెద్ద పెద్ద కెరటాలు ఫెడేల్ మని విరిగి, దభేల్ గుభేల్ మని పడుతున్నాయి.

తీరాన్న కూర్చొన్న వాళ్లంతా ఇళ్ళకి పోతున్నారు.

కెరటాలు ముందుకి వస్తున్నాయి. విరిగిపడి ముందుకి వచ్చి వెనకకు పోతున్నాయి.

"చంపేస్తాను; చంపేస్తాను. చంపేస్తాను"

అని తనలో తను గొణుక్కుంటున్నాడు గవరయ్య.

"బాకుతో పొడిచేస్తాను. పొడుస్తాను. పొడుస్తాను"

గవరయ్య భుజంమీద ఎవరో చెయ్యి వేసేరు.

తుళ్ళిపడ్డాడు గవరయ్య.

"ఎందుకలా భయపడతావ్? నేనూ నూకరాజుని" అన్నాడు నూకరాజు ఇసుకలో చతికిలబడుతూ

గవరయ్య మాట్లాడలేదు.

"కాని, ఇదేమిటొరి గవరయ్యా! ఆఫీసుకి రాలేదు. ఇంటి దగ్గిర లేవు. ఇక్కడొచ్చి ఇలా కూర్చున్నావేమిటి? ఏమిటొచ్చింది? ఏమిటె కథ? నీ వాటంచూస్తే నౌఖరీ అక్కర్లేనట్లుంది!" అన్నాడు నూకరాజు.

నవ్వాలా, ఏడవాలా, కోపం తెచ్చుకోవాలా?

గవరయ్య జవాబు చెప్పదల్చుకోలేదు.

కోపం తెచ్చుకోవాలా? ఏడవాలా? నవ్వాలా?

గవరయ్య అసలు మాట్లాడదల్చుకోలేదు.

కాని మరో పావుగంటకల్లా, జరిగిన దేమిటో అతని చేతనే చెప్పించి తెలుసుకున్నాడు నూకరాజు.

"వెళ్తా నే దాన్ని నరికేస్తాను" అన్నాడు గవరయ్య.

నూకరాజు నవ్వేడు.

"నవ్వేవంటే చూసుకో" అంటూ పిడికిళ్ళు బిగించేడు గవరయ్య.

"ఆగరా, బాబూ, ఆగు; ఒక్క క్షణం ఆలోచించు. ఆ లంజ కోసం మన బ్రతుకులు పాడుచేసుకుంటామా? ఇది పోతే దీని బాబులాంటిది మరొకర్తె వస్తుంది. నే చెప్పినట్టూ చెయ్" అన్నాడు నూకరాజు గవరయ్య కోపాన్ని లక్ష్యపెట్టకుండా.

అన్నాక మరో అరగంటకల్లా తన సలహా గవరయ్య వినేట్టు చేసేడు నూకరాజు.

రాత్రి తొమ్మిదిగంటలకి గవరయ్య తిన్నగా తాశీల్దార్ ఇంటికి వెళ్ళేడు.

తాశిల్దారు ఇంట్లోనే ఉన్నాడు.

పెద్ద గొంతుకతో అతణ్ణి బండబూతులు తిట్టడం ప్రారంభించేడు గవరయ్య వీధిలో నిల్చొని.

కేకలు విని వీధిలోకి వచ్చేడు తాశిల్దారు.

వీధిలో చాలామంది మనుష్యులున్నారు.

తాశీల్దార్ రాగానే గభీమని అతని చొక్కా పట్టుకున్నాడు గవరయ్య.

"ఇప్పు డెక్కడికి పోతావ్రా; లంజకొడకా" అంటూ సాగించేడు.

తాశిల్దార్‌కి అయోమయంగానూ భయంగానూ ఉంది, చుట్టూ ఉన్న జనం ఇద్దర్నీ విడదీయబోయేరు. కాని గవరయ్య పట్టు విడగలేదు. తాశిల్దారు పెనుగులాడుతున్నాడు.

"ఏందు కెందుకు?" అని కొంతమంది గాభరాతో కేకలు వేసి అడిగేరు.

"ఎందుకా? శెప్పొద్దన్న మేస్ట్రీటు కచేరీకి రండి. అక్కడ చెప్తాను" అంటూ గవరయ్య గట్టిగా అరచేడు.

ఇంతలో ఎక్కణ్ణించో కాని తొందర తొందరగా వచ్చేడు నూకరాజు.

వస్తూనే గవరయ్యని ఓ పక్కకీ, తాశిల్దార్ని ఇంకోపక్కకీ విడదీసి తోసేసేడు.

మెరుపులాగ తొందరగా ఇంట్లోకి పోయేడు తాశిల్దారు.

"తాగుబోతు లంజకొడకా! పెద్దవాళ్ళింటి దగ్గిరాత్రి అల్లరి? పద పోలీ స్టేషన్కి" అని కేకలు వేసి గవరయ్యని గొరగొర ఈడ్చుకు పోయేడు నూకరాజు.

వీధిలో చుట్టూ చేరిన వాళ్ళలో చాలామంది "ఎవరో తాగుబోతు వెధవ!" అనుకున్నారు.

చాలా మంది అలా అనుకోలేదు కూడా.

మరొక అరగంటకి నూకరాజు తిరిగివచ్చి తాశిల్దార్‌తో మంతనాలాలాడేడు రహస్యంగా,

"నే నుండగా తిరిగి మీ కాభయం ఎన్నటికీ రాదు" అని తాశిల్దార్‌కి హామీ ఇచ్చేడు.

ఆరీతిగా అతను హామీ ఇచ్చిన తరువాత ఇద్దరూ కలిసి నల్లమందు షావుకారింటికి వెళ్ళి నాలుగు వందల రూపాయిలు తెచ్చేరు.

ఆ రాత్రి నూకరాజు వెళ్ళి గవరయ్య చేతిలో రెండు వందలు పోసేడు!

"చూసేవా మరి? అన్నట్టుగా చేశానా లేదా? ఇప్పు డేమంటావ్?" అన్నాడు నూకరాజు సగర్వంగా.

అన్ని సంవత్సరాలూ మందంగా మొద్దుగా ఉన్న గవరయ్య మెదడు ఒక్క సారిగా పదునెక్కింది.

"ఇంతేనా?" అని అడిగేడు.

"ఏమిటీ! ఎంతున్నది?"

"రెండు వందలు"

"అవును అంతే" అన్నాడు నూకరాజు.

"వాణ్ణి వెళ్ళి అడగనా?" అన్నాడు గవరయ్య నవ్వుతూ.

నవ్విన నవ్వు వెటకారంగా, వికృతంగా, అమానుషంగా ఉంది.

నూకరాజు చకితుడయేడు.

"ఇదివరకు వెర్రి గవరయ్య కాడు వీడు. వీడు కొత్త గవరయ్య" అన్నాడు గవరయ్య.

లక్షల మీద వ్యాపారం చేస్తూన్న గవరయ్యకి ఆదిలో మనువుకి సొమ్ము ఆరీతిగా వచ్చింది.

తరువాత—

నూకరాజు ఆ రాత్రి తలవంచుకొని ఇంటికి పోయేడు.

ఆ రాత్రి తల మొత్తుకొంటూ రామయ్యమ్మ పుట్టింటికి పోయింది.

మొద్దుగా ఉండి వుండి ఒక్కసారిగా పదునెక్కిన గవరయ్య మెదడు కత్తి పదునుతో పనిచేస్తోంది అప్పటినుంచీ.

సాధారణంగా కత్తికి కనికరం తక్కువ!

ఆ దినం మధ్యాహ్నం పన్నెండు గంటల అయిదు నిమిషాల సమయంలో హెడ్ క్లార్కుతో చిరునవ్వు నవ్వుతూ మాట్లాడుతూన్న గవరయ్యని చూస్తూంటే సుబ్బయ్యకి భయం కలిగింది. కొంచెం చలితో వణికేడు.

ఈశున్ని సొమ్మెలా అడగడం?

మరొక పదినిమిషాలుపోయాక గవరయ్య కుర్చీలోంచి లేచేడు.

వెళిపోతాడా ఏమిటి చెప్మా?

లేదు. లేదు. ఇలావస్తున్నాడు.

"ఏమండోయ్, సుబ్బయ్యగారూ! ఎంతవరకూ తీసుకొచ్చేరు మహర్షుల్ని?"

"ఇదిగో, ఇదిగో, కూర్చోండి".

ఆరోజుకూడా మొదటిసారి వెళ్ళినప్పుడు "ఇంట్లో లేరు" అనే సమాధానంవచ్చింది పిలవగా, పిలవగా. రెండవసారి వెళ్లినప్పుడు వెంకట్రావు ఊళ్లోనే లేడన్నారు.

ఇంటికి ఎప్పుడు వెళ్ళినా "ఇంట్లోలేరు" "ఎక్కడికో వెళ్లారు" "ఎప్పుడొస్తారో తెలీదు" అనే మాటలే వినవస్తూండడంచేత, వెంకట్రావు ఇంట్లో వుండే లేడనిపించుకొంటున్నాడేమోనని సుబ్బయ్యకి చిన్న అనుమానం కలిగి గట్టినమ్మకంగా మారింది. ఒకరోజు "ఎక్కడికో వెళ్ళేరు" అనే మామూలు సమాధానం వచ్చినా "సరే వచ్చేదాకా వెయిట్ చేద్దాం" అని అక్కడే గుమ్మంలో కూర్చున్నాడు. వెంకట్రావు ఎంతకీరాడే! ఎంత పనిమీద ఎక్కడికి వెళ్ళినా ఇంత ఆలస్యం అవదుగదా అనుకున్నాడు సుబ్బయ్య.

తలుపులెట్టే దమాయించి వెంకట్రావింట్లోకి వెళ్ళడానికి సుబ్బయ్యకి ధైర్యంలేదు. ఎప్పుడైనా అతనాహ్వానిస్తే అతని గుమ్మంలో అడుగుపెట్టడమేగాని లేనప్పుడు బైట నిల్చోవలసిందే. లోపలికి, వెంకట్రావు ఆహ్వానం మీదవెళ్ళినా అత నెక్కడకూర్చోపెడితే ఆ గదిలో అలా కూర్చోడమేకాని ఇంట్లో చనువుగా తిరగడానికి వీల్లేదు.

"నా అనుమతిలేకుండా నాయింట్లో అడుగు పెట్టడానికి ఎంతమాత్రం వీలు లేదు."

అని వెంకట్రావు ఎన్నడూ సుబ్బయ్యతో చెప్పలేదు. కాని అతని అనుమతిలేన్దే అతని గుమ్మం దాటడానికి సుబ్బయ్య భయపడతాడు.

ఇందుచేతే వెంకట్రావు ఉన్నాడని తెలిసినా ఇంట్లోకి వెళ్ళలేకపోవడం, వీధి అరుగుమీద పడిగాపులు కాయటం జరుగుతూ వచ్చింది.

ఆరోజు పొద్దుట రెండవసారి వెళ్ళినప్పుడు కూడా ఇంట్లోంచి మామూలుమాటే వినవచ్చింది.

"ఎక్కడికో వెళ్ళేరండీ!" అని మృదువుగా శ్రావ్యంగా వచ్చింది మాట.

ఆవిణ్ణి ఎప్పుడూ చూడలేకపోయినా ఆమాట అంత మృదువుగా చెప్పిన వ్యక్తి వెంకట్రావు ఉంపుడుగత్తెనని సుబ్బయ్యకి తెలుసు.

"మీ బాకమరది చక్కటి మనిషిని జాగ్రత్త చేసేదయ్యా" అని అతన్తో అనేకులు అన్నారు. ఇంతబావుంటుంది, అంతబావుంటుంది అని అనుకోగా వినడమే గాని సుబ్బయ్యెప్పుడూ చూడ్డం తటస్థించలేదు. కాని, ఆవిడ చెప్పలేనంత అందంగా ఉంటుందని సుబ్బయ్య మనసులో బాగా నాటిపోయింది.

"ఇంతటి అపురూప సౌందర్యవతి, ఇంత మృదుమధుర కంఠంతో ఎంత సులభంగా అబద్ధం చెప్తోంది!"

అని సుబ్బయ్య ఆశ్చర్యపోయేడు.

విచారించేడు.

"ఆడవాళ్లు ఎంతకైనా సమర్థులు" అనుకున్నాడు ఒక్కక్షణం.

కాని ఆవిడ తనంతటతాను బుద్ధిపూర్వకంగా అబద్ధమాడిందనుకోడం సుబ్బయ్యకిష్టంలేదు.

వెంకటాద్రివు చెప్పమన్నప్పుడు, పాపం అలా చెప్పక తప్పుతుందా!

అందమైన ఆడమనిషి బుద్ధిపూర్వకంగా తప్పుచేసిందనుకోడం సుబ్బయ్యకి ఎంతమాత్రం ఇష్టంలేదు.

ఊం చుకున్నాడు! పోషిస్తున్నాడు!

ఎలాచెయ్యమంటే అలా చెయ్యాలి.

పాపం! ఈ ఇల్లాలి పనేమీ లేదు.

అని సమాధాన పర్చుకున్నాడు.

ఇంట్లో లేడని వినగానే సుబ్బయ్య వెనక్కిపోవడం జరుగుతూ వచ్చింది. మరో ప్రశ్న వెయ్యడం లేదతను. క్రాస్ పరీక్ష చేద్దామనే తలంపేలేదతనికి.

అవతలమనిషి చెప్పేది అబద్ధం అని తెలిసినప్పుడు ఇవతలమనిషికి కలిగే సుపీరియారిటీవల్లనో, లేక కోమలాంగి కోమలగాత్రం విందామనే ఆసక్తిచేతనో గాని సుబ్బయ్య ఆరోజు రెండవసారి వచ్చినప్పుడు వెంటనే వెళ్ళిపోకుండా,

"ఎక్కడికి వెళ్ళేరండీ?"

అని అడగ్గలిగేడు.

చెప్పిన భోగట్టావిని వెళ్ళడమేగాని ఎదురు ప్రశ్న వేసే అలవాటులేని సుబ్బయ్య అనీతిగా అడిగినందువల్ల కలిగిన ఆశ్చర్యంచేతనో, మరెందుచేతనో గాని లోనుంచి సమాధానం ఆలస్యంగావచ్చింది.

"ఏమిటి చెప్పమంటారు?" అని వెంకట్రావు నడిగివుంటుంది. అందుకే జవాబు రావడం ఆలస్యమవుతోంది,

ఇంతలోనే కంటికి కనపించని బంగారు తీగల్లో అల్లుకున్నాయి మాటలు

"ఊరికి వెళ్ళేరండీ!"

అబద్ధం! అబద్ధం!

అబద్ధంచెప్పి నవ్వుతోందా?!

నవ్వు ఆపుకొంటున్నట్టుగా ఉందే!!

నవ్వుతూ అబద్ధాలాడే ఈవిడ ఎలా ఉంటుందో! ఏలా ఉంటుంది? నాకు తెలుసు!! మేనకలా ఉంటుంది. రవివర్మ బొమ్మ చూసేను కదూ! అలాగే సరిగ్గా అలాగే ఉంటుంది. మెత్తటి పరుపుమీద తెల్లచీర కట్టుకొని తమలపాకులు నముల్తూ కూర్చొనుంటుంది. ఆమె అందాన్ని కళ్లతో తాగుతూ, చేతుల్తో తాకుతూ పక్కనే వెంకట్రావు! అదృష్టవంతుడు! ఇద్దరూ హాయిగా వుండగా మధ్య పానకంలో పుడకలా నా కర్కశ కంఠం. విసుక్కుంటూ "ఎక్కడికో వెళ్ళేరు" అనేసింది మామూలుగా. "ఎక్కడకెళ్ళేరు" అని నేనడుగుతానని అనుకొని వుండదు. విసుక్కోడూ, పాపం మరి! అనవసరంగా చిరాకు కలిగించే నావిడికి. నేనెప్పుడూ ఇంతే! కాని ఎంచేసేది? అడక్క తప్పదేమరి.

తెల్లటి చీరతో నల్లటి కురుల్తో, మృదువైన వంపులు తిరిగిన వళ్ళంతా వెంకట్రావుకి అప్పజెప్తూ ఉండగా తనువేసిన "వెధవ ప్రశ్న"కి తన కట్టెదుట ఆమె విసుక్కుంటున్నట్టు తోచింది సుబ్బయ్యకి.

"నోరు జారేక ఏం చేస్తాం" అనుకున్నాడు.

జవాబు చెప్పడానికి అతని సలహా అడిగింది. కళ్ళల్లో పడుతూన్న ఆమె పాముగాటి జుత్తు ఓ పక్కకి తోస్తూ "ఊళ్ళోలేరని చెప్పి తోలేద్దూ" అనుంటాడు వెంకట్రావు. సలహా విని "అంత అబద్ధం ఆడమంటారా" అని నవ్వుతూ అతణ్ని కౌగ్గులాడింది.

ముద్దాడుతూ నవ్వింది!

నవ్వాపుకొంటూ ఆమాట అందజేసింది.

"ఊరికి వెళ్ళేరండి!"

ఉప్పెనగా వస్తూన్న నవ్వు ఆపుకోందికి తెగ ప్రయత్నం చేస్తోంది అనుకున్నాడు సుబ్బయ్య.

ఆడవాళ్ళ హేళనకి మొగవాళ్ళకి కలిగే బాధ సుబ్బయ్యకూడా కలిగింది.

ఉదయం తొమ్మిది గంటలకి ఎండ చురుగ్గా ఉన్నది. సందులోకి జర్ మని చప్పుడుచేస్తూ 'జీప్' ఒకటి తిరిగింది. 'జర్' మని చప్పుడుచేసుకొంటూ పోయింది. పక్కింట్లో ఎవడో పిల్లడు ఏడుస్తున్నాడు. ఎదటింటో ఎవరో యాభయ్యేళ్ళ వితంతువు పద్దెనిమిదేళ్ళ కన్యతో కూరగాయలబేరం చేస్తోంది. చేసి ఇంట్లోకి వెళ్ళింది. కూరగాయలమ్మే పిల్ల తట్టసద్దుకొని సుబ్బయ్యవైపు సూటిగా చూసింది.

"నన్నో వెర్రివెధవనిచేసి నవ్వుకుంటున్నారు" అని బాధపడ్డాడు సుబ్బయ్య.

ఎండ చురచురమంటోంది. పక్కింట్లో పిల్లడు ఏడుపు ఆపేసి ఒక్కసారిగా నవ్వడం ప్రారంభించేడు.

"నవ్వుతున్నారు నన్నుచూసి."

కూరలమ్మే కన్య సుబ్బయ్యవైపు చూస్తోంది సూటిగా. సుబ్బయ్య ఆ పిల్లవైపు చూసేడు, కాని ఆమె ముఖం వికృతంగా ఉందనిగాని, ఆమె శరీరం యవ్వనపు బిగిలో ఆకర్షణీయంగా ఉందని గాని చూడలేదు.

"ఇదికూడా నన్నుచూసి నవ్వుతోందా?" అని చూసేడు.

కూరలు కొనిపించడానికి 'ప్రిలిమినరీ'గా ఆమె సుబ్బయ్యని చూసి, చిన్న చిరునవ్వు పారేసింది.

"ఇదికూడా నవ్వుతోంది!"

అంతా నవ్వుతున్నారు!

నన్నుచూసి అంతా నవ్వుతున్నారు.

నన్నో వెర్రివెధవనిచేసి అంతా నన్నుచూసి నవ్వాపుకోలేకుండా ఉన్నారు.

పోతాను. ఇంటికి పోతాను.

మెల్లిగా ఇంటికి నడకసాగించేడు సుబ్బయ్య. రెండు మైళ్ళు నడచి వెళ్తున్నాడు, రెండవసారి ఆరోజు అలా వెళ్లడం.

రెండవపర్యాయం ఇంటికి పోతున్నప్పుడు మూడోసారి మళ్ళీవద్దామనే కృతనిశ్చయంతో వెళ్ళేడు, సుబ్బయ్య.

ఊళ్ళోనే, ఇంట్లోనే ఉండి లేవనిపించుకొంటున్నాడు వెంకటార్రావు.

నన్ను గుమ్మంలోంచే గెంటేస్తున్నాడు.

కొంపతీసి దగా చెయ్యడు కద?!

దగాచేసేడంటే చస్తాను.

బాబోయ్! చస్తాను!

ఇవాళ ఎలాగయినాసరే అతణ్ణి కలుసుకోవాలి.

లేకపోతే కొంప మునుగుతుంది.

ఆఫీసులో ఆరోజు.

"ఏమయ్యోయ్, సుబ్బయ్యా! ఒంట్లో, బాగులేదా?" అని రామస్వామి అడిగేడు.

"అబ్బబ్బే! లేదండీ! బాగానే ఉంది."

గవరయ్య వచ్చి, వెళిపోయేడు.

సుబ్బయ్యవైపు చూడనేలేదు.

సుబ్బయ్య వంట్లో గాభరాగాఉంది జ్వరం లేకపోయినా వళ్ళంతా వేడిగా ఉంది. కాయితాలు మడత పెట్టబోతూవుంటే చేతులు వణికేయి. కలంతో రాయబోతే వేళ్ళు టొంకర్లుపోయేయి.

కొంపతీసి దగా చెయ్యడు కద!!

పక్కనే కూర్చొన్న టైపిస్టు ఎడతెరిపిలేకుండా టైపుకొడుతున్నాడు.

టప్‌టప్ టపటప్ టపటపటప్, టప్‌టప్ టపటప్.

ఛస్తాను, ఛస్తాను.

చచ్చేదాకా చావు బాజాలాగ వీడు టైపు కొడుతూనే ఉంటాడు కాబోలు.

హాబ్బబ్బా! వెధవబాధ! ఛస్తున్నాడు.

అన్నిటికన్నాముందు ఈ ఉత్తరం పంపించెయ్ మన్నారు దొరగారు" అని ఆఫీస్ ప్యూన్ వెంకన్న ఓ ఉత్తరం పట్టుకొచ్చేడు.

"ఏదయ్యా సుబ్బన్నా ఓ సిగరెట్టిలా ఇచ్చుకో" అన్నాడు అవధాని.

టైపిస్టు బాదేస్తూనే ఉన్నాడు.

"పోర్టికో"లో కూర్చున్న పీచుజుత్తు డ్రైవరు ఓడీకి ఆఖరి పీల్చిచ్చేసు రామస్వామి ఆరోజుకి యాభైరెండోసారి పొడుం పీల్చేడు.

చస్తాను, దగాచేస్తే!

వెంకట్రావు నెలాగైనా కలుసుకోవాలి.

కలుసుకొని సంగతేదో తేల్చుకోవాలి.

తగుమనిషి తరహాగా లేదు వెంకట్రావు ప్రవర్తన.

ఏమ్హామీ తగుమనిషి తరహాగా లేదు.

ఇంట్లోఉండే ఆవిడచేత అబద్ధా లాడించేడు.

(ఎంత ఇంపుగా చెప్పింది!! పాపం ఆవిడ తప్పేమీ లేదు.)

వ్యవహారం చూస్తే ఏమీ బావుండడంలేదు.

ముఖాముఖీ మాట్లాడే వ్యవహారం ఫైసలు చెయ్యాలి.

ఇంట్లో లేడంటే ఈసారి తలుపు తియ్యమంటాను, అనుకొని ఆ రాత్రి ఇంటినుండి బయల్దేరేడు సుబ్బయ్య.

మెయిన్ రోడ్డులోంచి ఆరాత్రి ఎనిమిది గంటల సమయంలో సందు లోకి వస్తూనే అరుగుమీద కూర్చొన్న వెంకట్రావునిచూచి ఇంట్లో ఉన్నాడు కదా అని సంతోషించేడు సుబ్బయ్య.

"హామ్మయ్యా" అని నిట్టూర్చేడు.

ఊరికీ వెళ్ళలేదు, గిరిగీ వెళ్ళలేదు. నేను మొదట్నించీ అనుకొంటూనే ఉన్నాను అని సంతోషించడమే కాకుండా గర్వించేడు.

అంత పచ్చి అబద్ధాలు, (మధ్యని పాపం ఆ మేనకచేత; చెప్పించి నందుకు వెంకట్రావు కొంచెం సిగ్గుపడి తనతో మాట్లాడ్డానికి మొహమాట పడతాడేమో అనుకున్నాడు. అందుచేత అడుగు జోరుగావేసేడు. సిగ

కొర్ర్టాకటి తీసి అక్కడే వెలిగించేడు. చిన్న చిరునవ్వు నవ్వే ననుకొన్నాడు. అరుగుమీద కూర్చున్నాడు.

సుబ్బయ్య వచ్చినందుకు వెంక(ట్రావు సంతోషం ప్రకటించలేదు. రమ్మని ఆహ్వానించలేదు. రాకకి కారణం అడగలేదు. "ఎప్పుడూ ఈ మధ్య కని పించలేదే! ఏమిటి విశేషాలు?" అనే మామూలు మాటలైనా అనలేదు.

రెండో మనిషి లేనట్టుగా, ఎటో చూస్తూ చుట్ట కాలుస్తూ కూర్చు న్నాడు కాలుమీద కాలు వేసుకొని.

సుబ్బయ్య సంతోషం చచ్చిపోయింది.

గర్వం అణగారిపోయింది.

సిగరెట్టు ఆరిపోయింది.

వెంకట్రావు చుట్ట తెగజోరుగా వెలుగుతోంది.

ఆరోజు రాత్రి ఎనిమిది గంటల అయిదు నిమిషాల సమయంలో, సుబ్బయ్య సిగరెట్టు ఆరింది.

వెంకట్రావు పొగచుట్ట వెలిగింది.

ధీమాగా కాల్తూన్న పొగచుట్టలాగ వెంకట్రావు ధీమాగా కూర్చొని ఉండగా సుబ్బయ్య సంతోషం వెలుగు వెలిగి ఆర్పు ఆరింది.

సుబ్బయ్య ఎందుకొచ్చేడో వెంకట్రావుకి తెలుసు.

వెంక(ట్రావుకి తెలుసునని సుబ్బయ్యకి తెలుసు.

తనకి తెలుసునని సుబ్బయ్యకి తెలుసునని వెంకట్రావుకి తెలుసు.

అది సుబ్బయ్యకి తెలుసు............

తెలిసిన ఇద్దరూ తెలియనట్టుగా కూర్చున్నారు.

సుబ్బయ్య కింగారుపడుతున్నాడు. గాభరా పడుతున్నాడు. ఆందోళ నపడుతున్నాడు. బెంగపెట్టుకుంటున్నాడు. భయపడుతున్నాడు.

దగా చెయ్యడుకద! దగా చెయ్యడుకద!!

వెంకట్రావు దగా చెయ్యడుకద!!!

అయ్యయ్యో! చేస్తాడయ్యా చేస్తాడు !!

వెంకట్రావు దగా చేస్తాడు!!!"

అని ఎవరో చాటుతున్నారు.

డప్పులు కొట్టించేరు బాజాలు వాయించేరు. భీషణ శంఖాలు పూరించేరు. భీకరగర్జనగర్జించేరు. మదగజంలా ఘీంకారం చేసేరు.

అన్నీ చేసి చెప్పేరు! చెప్పేశారు!! చెప్పి పారేశారు!!!

వెంకటార్రావు తప్పక దగా చేస్తాడు!!

వెంకటార్రావు చెయ్యకపోతే ఇంకెవరు చేస్తారు???

సుబ్బయ్య! చూస్తాడుకదూ!

వెంకట్రావు చేస్తావుగదా!

చూస్తావుగదా!

అతనిదగా!

తడిలేని గొంతుకతో రెండు పొడి ముక్కలు మాట్లాడేడు సుబ్బయ్య

"ఇదిగో, ఒచ్చేను"

అవును, చూసేను"

ఇంకేమనడం? భోగట్టా ఎలా ఎత్తడం? లోపల్నుంచి చేసక వింటోందో ఏమిటో! అతణ్ణి డబ్బడుగుతే ఆవిడ బెంగ పెట్టుకుంటుందో ఏమో! ఇతనియందు మక్కువతో ఉంది. నన్ను తిడుతుంది ఏడుస్తుంది. ఆ ఉసురంతా నాకు తగుల్తుంది.

ఛా ఛా!

ఆమె ఉసురు నాకు తగల్డమేంవిటి అసందర్భం! కాని ఎలా అడగడం? ఏమనడం?

"ఊరికి వెళ్ళేవన్నారు, ఇందాట్లా వస్తే"

అయ్యయ్యో! నేరకపోయి అనేశాను; ఆవిడ నొచ్చుకొంటుందికాస!

"ఆహా! అయితే?"

ఏమీ లేదు.

"అయితే:"

"ఏమీ లేదు! ఊరికెళ్ళేవన్నారని ఊరికే అన్నాను" ఊరుకోసుండా!

మధ్యాహ్నం పూట మండు టెండలో కాలిన అరుగు, రాత్రయినా ఇంకా కాల్తూనే ఉంది.

కూర్చుందుకి ఎంతమాత్రం సుఖంగా లేదు.

ఎంతసేపు ఇలా కూర్చోడం?

నేనొచ్చిన పనేమిటి?

నన్ను రమ్మన్నాడే ఆరోజు బజార్లో కనపడినప్పుడు!

మరి ఇప్పుడు మాట్లాడ్డేం?

మాట్లాడ్డే!!!

నేనే మాట్లాడాలి.

అవసరం వచ్చినప్పుడు అడక్కపోతే లంపటమంతా నా మెడకి చుట్టుకొంటుంది.

వచ్చేనాను, భగవంతుడా,

"చెల్లెమ్మా, చిన్నపిల్లలూ నీకోసం కాసుక్కూర్చుంటారోయ్! లేటవుతూంది!"

వెంకటారావు లేచి నిల్చున్నాడు.

అయ్యయ్యో! వెళ్లిపోతున్నాడు ఇంట్లోకి!

"ఇదిగో, చూడుచూడు. ఆ విషయంగురించి వచ్చేనోయ్"

"ఏ విషయం?"

"అదేనోయ్! ఆవిషయం! మొన్నా...ఈమధ్య ఆరోజు ఇచ్చేస్తా నన్నావుకదూ?"

"ఎన్నిసార్లు చెప్పినా నీ నసుగుడు మానవు! ఏమిటో అనుకున్నాను. స్పష్టంగా చెప్పకూడదూ ఆ సంగతేనని. అయితే ఇంతకీ ఏమంటావిప్పుడు?"

"వాడు తొందరచేస్తున్నాడు"

"ఆ వెధవ తొందరచేస్తే దేవేంద్రుడు తొందర చేసినట్టు-చెప్తున్నావేమిటి!?

"కాదోయ్ బాబూ! నన్నొదలకుండా ఉన్నాడోయ్"

"ఒదలకపోతే తొక్కా లొల్చెయ్"

"అతనే నావి ఒల్చేస్తానంటున్నాడు"

"నీ అనవుచూసి ఏమైనా అంటాడా వెధవ! ... అయినా అయామ్ సారీ! అర నిమిషంలో ఇప్పుడు ఎక్కణ్ణించి తెస్తాను! నాలోగ్రిజు లాగమను"

"ఆగనంటున్నాడు! ఏమిటి సాధనం?"

"ఆక్కపోతే చావమను, ఉరేసుకొని. ఆక్కఆపోతే ఇవ్వనే ఇవ్వనని చెప్పు దిక్కున్నవాడితో చెప్పుకోమను."

అయ్యయ్యో! అనుకున్నట్టుగానే చేస్తున్నాడే!

"మరింక నువ్వు ఇంటికి వెళ్ళు"

వెళ్లేడు, పోయేడు, వెళ్ళిపోయేడు,

వెళ్ళగానే అడుగుతుంది మేనక.

"పోయేడా లేదా" అని.

"హమ్మయ్య" అని అతని చుట్టూ మెత్తటి చేతులువేసి కౌగలించుకొంటుంది.

హబ్బా! నాకు బాధగా ఉంది.

కాని చేసేదేముంది?

ఇంక పోవాలి. ఇంటికి పోవాలి.

కథల్లో కష్టాలుపడే సినీమా హీరోలాగ నడుచుకొంటూ ఆ రాత్రి వెళ్లేడు సుబ్బయ్య.

"నా దగ్గిర డబ్బుంటే ఇచ్చెయ్యనూ; లేన్దే ఏంచెయ్యడం? అయినా, అంత సగవలా ఉంటే ఎలా? కాస్త గట్టిగా ఆ వెధవతో కొన్నాళ్ళపాటు ఆగితే ఆగు. లేకపోతే నీకు డబ్బూ ఇవ్వను. గాడిద గుడ్డూ ఇవ్వను. దిక్కున్నవాడితో చెప్పుకో అంటే వాడు చచ్చినట్టు నోరు మూసుకుంటాడు. మా బావ ఒట్టి నంగిరి పింగిరిగాడు. అందులోనూ గవరయ్యగాణ్ణి చూస్తే ఎందుకో భయం! ఛఁ" అని ఇంట్లో వెంకటాద్రివు విసుక్కున్నాడు.

# 8

“ఇంత దురవస్థ ఎన్నడూ ఎరుగను.”

అనుకున్నాడు సుబ్బయ్య ఆ రాత్రి వెంకట్రావుతో మాట్లాడివస్తూ.

వర్ణించ వీలులేనంతగా ఉంది అతని మనః క్లేశం. తీరి కూర్చొని అంతా పీకల మీదకి తెచ్చుకున్నానే అని దుఃఖించేడు.

అతనికి వెంకట్రావుమీద చాలా కోపం వచ్చింది.

పట్టూ పట్టూ మని ఒచ్చి నా గొంతుకమీద కూర్చున్నాడు అయిదు వందలు కావాలని.

“నీ దగ్గిర అయిదువంద లుంటాయని రాలేదుస్మా” అన్నాడా రోజు.

నేను బీదవాణ్ణని నన్ను చూస్తే నిరసన.

మరయితే నా దగ్గిర కెందుకొచ్చాడో!

తను మహా అంత గొప్పవాడయితే అయిదు వందల కోసం నన్నడగడ మెందుకు?

ఇప్పు డిలా వట్టి చేతుల్తో పంపడ మెందుకు?

ఇవ్వలేనని చెప్పెయ్య కూడదూ?

అయినా, నాదే పొరపాటు! వెంకట్రావు అడగమనగానే వెళ్ళి ఆమట్టుకి గవరయ్యని నే నడిగెయ్యాలా?

అడిగినా, అతను ఇవ్వడం ఏం ఖర్మం ఒచ్చింది!

బావుంది! అతని అవసరం ఉండి అతనిచ్చేక.

బిల్సులో ఏమైనా సదుపాయం చేస్తాననుకున్నాడు.

అమ్మయ్యో!!!

నే నతని కేమీ సాయం చెయ్యలేదు.

భగవంతుడి సాక్షిగా చెప్తున్నాను.

ఏ సాయమూ చెయ్యలేదు,

కాని ఎవరు నమ్ముతారు??!!

చెయ్యకూడని పని డబ్బు పుచ్చుకొని చేసేవంటారు.

‘చెయ్యలేదు బాబూ,’ అంటే అపనమ్మకంతో నవ్వుతారు.

హెడ్ క్లార్క్ అన్న మాటలకి మరొకడైతే కత్తితో పొడుచుకు చచ్చిపోయుండును.

సిగ్గూ లజ్జా లేని వెధవని కాబట్టి ఇలా బతికున్నాను.

ఇంతటితో అయిపోయిందా ?

ఇంకా ఏముందో ముందు ? ! !

నాకు భయంగా ఉంది.

మరేం ఫర్వాలేదని అవధా నన్నాడు.

కాని నాకు భయంగా ఉంది.

అవధానికి అన్ని భోగట్టాలు తెలాస్తాయి.

అవధానికి అన్నీ తెలుసు.

అవును. అవధాని అనుభవం ఉన్నవాడు,

అలాంటి అవధాని అసరా ఇచ్చేడే !

మరేం ఫర్వాలేదని !

అందుచేత ఆఫీసులో మరేగొడవా ఉండదనుకుంటాను.

కాని, ఈ గవరయ్య !

గవరయ్య నేం చెయ్యడం?

అయిదువందలు ఏక్కణ్ణుంచి తెచ్చేది? వెంకట్రావు ఇవ్వనట్టే. నిరాశ చేసుకోవలసిందే! మరయితే ఎలాగ ?

అయిదువందలూ నే నివ్వకపోతే?...

గవరయ్య చంపేస్తాడు.

పీకమీద కాలు వేసి తొక్కేస్తాడు.

నల్లిని నలిపినట్టు నలిపేస్తాడు.

వెంకట్రావు సొమ్మిస్తే బావుండును.

నాలుగురోజులు పోతే ఇస్తానన్నాడు.

కాని, ఇవ్వడు!

ఇచ్చినా గవరయ్య ఆగుతాడో ఆగడో !

తల్చుకొందికి భయంగా ఉంది.

గవరయ్య బాధ ఎలా వదుల్చుకోడం ?

ఏందారి దేవుఁడా ? రక్షింపవా భగవంతుడా

ఈ విపత్తు తప్పిపోతే,

దేవదేవా- జగన్నాథా

పూరీ వస్తాను, నీ కోసం.

రక్షించు. రక్షించు.

సుబ్బయ్యకి కొంత ధైర్యం వచ్చింది.

జగన్నాథస్వామి తప్పక రక్షిస్తాడు.

నాన్న అంటూ ఉండేవాడు కదా !

పూరీ జగన్నాథస్వామి కోరినవన్నీ ఇస్తాడని.

నాన్న చాలాసార్లు పూరీ వెళ్ళి వచ్చేడు.

ఏముంది? నేకూడా ఇట్టే వెళ్ళి అట్టే రావచ్చు.

జగన్నాథా ! రక్షింపవా ?

ఒకసారే కాదు. మరోసారి కూడా వస్తాను.

నేను, కమల, కృష్ణుడు.

ముగ్గురం కూడా తల లిచ్చేస్తాం !

సావిత్రి కూడా వేణీ ఇచ్చేస్తే బావుండును. కాని ఇవ్వదు.

"నీ వేణి ఇస్తేనే నీ భర్త ఆపద తప్పుతుంది" అని సాక్షాత్తు జగన్నాథ స్వామి వచ్చి చెప్పినా ఇవ్వదు.

కాని, భగవంతుడా ! నేనూ నా పిల్లలూ వస్తాం.

ఎలాగైనా కాపాడు, నన్ను కాపాడు.

మెల్లగా నడుస్తున్నాడు సుబ్బయ్య.

అతనికి ఇంటికి వెళ్ళాలని లేదు.

గోడలమధ్య గదుల్లో వంటరిగా కూర్చోవాలి.

ఇంకా గాభరాగా ఉంటుంది.

"ఏమలా ఉన్నారు ?" అని అడగనైనా అడగదు సావిత్రి.

నేను బతికున్నా ఒకటే చచ్చినా ఒకటే దానికి.

ఈపాటికి కమలా క్రిష్ణుడూ పడుక్కొనుంటారు.
నిశ్చింతగా, హాయిగా.
నే నిన్ని కష్టాల్లో ఉన్నానని తెలీదు వాళ్లకి.
తెలుస్తే, పాపం, కమల బెంగపెట్టుకొంటుంది.
ఒట్టి సత్తెకాలం పిల్ల.
రాత్రింతా ఏడుస్తూ కూర్చుంటుంది.
అ దేమస్తే నా కృష్టంగా ఉంటుంది.
సుబ్బయ్య కళ్ళు చెమ్మగిల్లేయి.
కారిన కన్నీరు తుడుచుకున్నాడు.
ఆడదానికన్నా అధ్వానం నేను
'ఏం సుబ్బయ్యా. ఎందుకలా ఏడుస్తున్నావు?'
అని ఎవరైనా అడుగుతే ఏం చెప్పేది!
"సుబ్బయ్య ఆడదాన్లా ఏడుస్తున్నాడు" అని అంతా ఎగతాళీ చేసి వెక్కిరింపుగా నవ్వుతారు'
కనికరం లేకుండా నవ్వుతారు.
లేదు ముమ్మాటకీ లేదీ లోకంలో కనికరం.
అంతా అతి నిర్దాక్షిణ్యంగా ఉంటారు.
ఛు! ఛా! వెధవ లోకం! వెధవ మనుష్యులు!
ప్రళయం వచ్చి అంతా అంతమైతే బావుంటుంది.
మనిషన్న ప్రతివాడూ నాశనం కావాలి.
అందరికన్నా ముందు గవరయ్యా చావాలి.
మిగతా అంతా ఉన్నా పరవాలేదు.
గవరయ్య చచ్చిపోవాలి.
హాహ్హాహ!!
ఈ రాత్రే గవరయ్య చచ్చిపోతే ఎంత హాయిగా ఉంటుంది!!!
గవరయ్య ప్రాణాలు పోవాలి. ఎలా పోతుంది ప్రాణం?
ఏముంది? క్షణంలో పోవచ్చు.

ఎంతమంది చచ్చిపోలేదు, అకస్మాత్తుగా.
తెగ తాగే మనుష్యులకి గుండె ఆగిపోతుందంటారు.
గవరయ్య మస్తుగా తాగుతాడు.
ఏం? ఈరాత్రి గుండె ఆగిపోయి చచ్చిపోకూడదు.
చీకట్లో పాము కరవకూడదా!
ఇల్లు కూలి మీదపడ కూడదా!
ఏ చెట్టుకో కారెగుర్దేసి తలబద్దలవకూడదా!
డబ్బుకోసం దొంగలు చంపకూడదా!
వెధవ ప్రాణం ఎంతసేపట్లో పోవాలి.
గవరయ్య ప్రాణం అన్నిటికంటె గొప్పది కాదుకదా!

గవరయ్య ప్రాణం పోయే సాధనాలుగురించి ఆలోచించడంలో గవరయ్య ఎందుకు చచ్చిపోవాలని కోరుతున్నాడో ఏమర్చాడు సుబ్బయ్య.

రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

చల్లగాలికి మెల్లమెల్లగా తెల్లతెల్లటి మేఘాలు ఆకాశంలో అక్కడక్కడ తేల్తూ పోతున్నాయి. చేతికందని చిరుమబ్బులవైపు చల్లటి చందురుడు తెల్లబోయి చూస్తున్నాడు. దూరంగా కనబడుతూన్న తోటలో కొబ్బరిచెట్లు బరువుగా తలలాడిస్తున్నాయి. నీలివెన్నెల్లో ఊరంతా నీలంగా అగుపిస్తోంది.

సుబ్బయ్య వంతెనమీదకి వచ్చేడు.

"ప్రకృతి ఎంత రమణీయంగా ఉంది!"

అని సుబ్బయ్య సాధారణంగా అనుకోడు.

కాని, ఆరాత్రి అక్కడకి వచ్చేక "ఆహా! ఇక్కడ బావుంది!" అని ఆశ్చర్యపోయేడు.

వంతెన దగ్గర చల్లగా ఉంది. హాయిగా ఉంది. ప్రశాంతంగా ఉంది. సిమెంటు గట్లమీద దూరదూరంగా అక్కడక్కడ ఎవరో కూర్చున్నారు. అటూ ఇటూ తూగుతూ రెండెడ్లబండి ఒకటి పోతోంది. సిమెంటు గోడ పాలరాతి గచ్చులా కనిపిస్తోంది. దిగువని ఇసుక తిన్నెలు వెండి కుప్పల్లా మెరుస్తున్నాయి. పారుతోన్న పిల్లకాలువ కొన్ని చోట్ల తళతళలాడుతోంది.

ఉత్తరాన్నుండే నీలి పర్వతం ప్రాచీనకాలపు మృగంలా అలసిపోయి పడుకొంది.

చల్లగా మెల్లగా ఆగి ఆగి పిల్లగాలి వీస్తోంది.

"ఇక్కడ హాయిగా వుంది" అనుకొని వంతెన గట్టుమీద కూర్చున్నాడు సుబ్బయ్య; సిగరెట్టుతీసి ముట్టించేడు. నీలంగా మేఘంలా లేచిన పొగ వెన్నెల్లో కరగిపోయింది.

ఇంటికి వెళ్ళను. ఇలా ఇక్కడే కూర్చుంటాను.

స్వేచ్ఛగా ఉన్నాదిక్కడ.

రెండెడ్ల బండీ వంతెన దాటిపోయింది. ఆ వైపునుంచి పాటపాడుతూ వరో సైకిలుమీద వస్తున్నారు, పాట దగ్గరపడి దూరమైపోయింది. ఇంకో వైపునుంచి రైలుకూత వినవచ్చింది.

"పడమటి బండీ కాబోలు వస్తోంది"

తూర్పునుంచి పడమటకి, పడమటనుంచి తూర్పుకీ ఎవరెవరో ప్రయాణం చేస్తూనే ఉంటారు.

ఈ వూళ్ళో దిగుతారు. మరోచోట దిగుతారు. ఈ ఊర్లో ఎక్కుతారు. ఇంకోచోట దిగుతారు.

ఎందరెందరో ఎన్నెన్ని చోట్లకో ప్రతిదినం ప్రతినిమిషం ప్రయాణం చేస్తూనే ఉంటారు.

ఎక్కడికీ వెళ్ళనివాణ్ణి నేనొక్కణ్ణే.

నేనుకూడా ఎక్కడకో అక్కడకి ఎందుకు పోగూడదు?

ఈమట్టుకి ఇలా ప్రయాణం అయిపోతే...

ఏక్ నిరంజన్ గా ఎక్కడకోపోతే...

సుబ్బయ్య కనిపించడంలేదు తెలుసా? నిన్నరాత్రి వంతెనగట్టుమీద కూర్చున్నాట్ట. మరి పికర్లేదు, సూయిసైడ్ కేసో ఏమిటో అవునవును, అంతే అయుండాలి.

ఎందుకు ఇలాంటి పనిచేసేడు సుబ్బయ్య? పాపం రోజూ ఆవార కూర్చొనేవాడు, పాపం హెడ్ క్లార్కు ఎంతో ఇన్ సల్టింగ్ గా మాట్లా

డేడు. తనేమిటో తన పనేమిటో. మట్లాడ్డంగాని మాటాడేడా! ఎంతో అమాయకుడు! ఈ రామస్వామిగాడే నొప్పించేడు! "ట్రైబెన్" చేశాట్ట? నిజమేనంటావా?

మధ్యాహ్నం అంతా 'కేంటీన్'లో కూర్చొని కాఫీ తాగుతూ మాటాడుకుంటారు,

సరిగ్గా పన్నెండు గంటలకి వస్తాడు గవరయ్య.

సుబ్బయ్య సీటు ఖాళీ !!

"ఏమయేడు సుబ్బయ్య?"

ఇంకా మీకు తెలీదూ? నిన్న రాత్రినించీ కనపించలేదు. ఏమిటో? కాలవలో 'బాడీ' కోసం వెతుకుతున్నారు!

ఇంకెన్నాడుగుతాడు అయిదువందలు?

నా ఉసురంతా తగుల్తుంది.

నిజంగా ఎక్కడికైనా పోవాలనివుంది నాకు.

ఎక్కడికి పోవడం? ఎలాపోవడం?

పోతే నా పెళ్ళాం పిల్లల గతే మవుతుంది?!

పాపం, కమల ఏడుస్తుందే!

బెంగ పెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తుందే!!

వెక్కి వెక్కి ఏడ్చేడ్చి బెంగ పెట్టుకొని చచ్చిపోతుందో ఏమిటో!

అబ్బే లాభం లేదు.

ఇలా చేనీవ్రాళ్ళో ఉండవలసిందే!

కంటికి కనిపించని తాళ్ళతో కాళ్ళూ చేతులూ కట్టేసినట్లయింది సుబ్బయ్యకి.

నిస్పృహతో అలానే కూర్చున్నాడు.

వంతెనమీద చాలామంది మనుష్యులు నడుస్తున్నారు.

ఇంతమంది ఎక్కణ్ణించి వస్తున్నారు?

"వరలక్ష్మి పాటలు బాగున్నాయిరా"

"అంజలీదేవి యాక్షనుమాత్రం?"

ఓహో సినీమానుంచి వస్తున్నారు.

ఊళ్ళో అంతా సినీమాలకి వెళ్తున్నారు.

నేనొక్కణ్ణే చూడనివాణ్ణి.

చూసేదేముంది? నా బతుకే ఓ సినీమా లాగుంది.

చూడండి చూడండి "సుబ్బయ్య జీవితం"

ఆంధ్రప్రజానీకానికి అందజేసే చిత్రరాజం.

ఆంధ్ర చిత్ర జగత్తులో, ఆంధ్ర 'సినీ' 'ఫీల్డు'లో విషాదగాధలు లేవుకదా అని విషాదంలో మునిగిపోయిన ఆంధ్రులకు సమర్పించే మా కానుక.

"సుబ్బయ్య జీవితం"

ఇదియొక విషాదగాధ. మహత్తర సన్నివేశాలతో కూడుకున్న రసమయ చిత్రం.

వేనవేల ప్రజలు చిత్రాన్ని చూచి ఏడ్చి యేడ్చి ఇంటికిపోయి మూర్ఛపోయేరు.

వీళ్లంతా ఇంటికి పోతున్నారు.

'సుబ్బయ్య జీవితం' వీళ్లు చూడలేదు కాబట్టి ఇళ్ళకిపోయి మూర్ఛపోరు.

హాయిగా నిద్రపోతారు. కలలన్ననియెదరు.

నేనుకూడా ఇంటికిపోతే బావుంటుందేమో.

గట్టు దిగుదామా, గట్టుమీద కూర్చొనే ఉందామా అని తర్కిస్తున్నాడు సుబ్బయ్య.

"ఏమండీ సుబ్బయ్యగారూ ఇక్కడ కూర్చున్నారేం?

అన్నాదావిడ ఎదురుగా నిల్చొని నవ్వుతూ.

రావడం చూడలేదు.

ఎవరీవిడ?

ఎవరా? 'ఎవరీవిడ' అని చూస్తూ ముంగిలా మాటాడకుండా చూస్తూ కూర్చుంటావా? మొద్దా!

ఈవిడే ఆవిడ!

ఆవిడే ఈవిడ!

నల్ల చీరావిడ!

నల్లచీరావిడ నల్లచీరే కట్టుకుంది.

నీలివెన్నెల్లో నల్లటి నలుపుచీరవెనక ఆవిడ తెల్లగా మెరుస్తోంది.

నల్లటి చీరవెనక తెల్లటి జాకెట్టు పాలనురుగులా పొంగుతోంది.

తెల్లటి వెన్నెల్లో ఆవిడ నల్లటి కళ్ళతో మాస్తోంది.

మిలమిల మెరుస్తోన్న నల్లటి కళ్ళతో చూస్తూ తెల్లటిపళ్ళు కనబడేలా నవ్వుతోంది.

ఈవిడ మనుజకాంత కాదు.

ఈవిడ దేవతామూర్తి.

సుబ్బయ్యలో సంతోషం ఉప్పొంగి కట్లు తెంచుకొంది.

"ఏమండీ సుబ్బయ్యగారూ! ఇక్కడ కూర్చున్నారేం?"

ఎందుకూర్చున్నాను? ఎవరికోసం కూర్చున్నాను"

ఎందుకోసం? ఎవరికోసం?

నీకోసం! నీకోసం!

నీకొరకై ఎదురుచూస్తూ కూర్చున్నాను.

గాలిచేత ఎవరో కబురు పంపించేరు.

"అక్కడకూర్చో! ఆవిడ వస్తుంది!"

వస్తావని ఎవరో వార్తతీసుకు వచ్చేరు.

అందుచేత నీగురించి నిరీక్షిస్తూ ఇక్కడ ఆసీనుడనైయున్నాను దేవీ!

మీరు కన్పిస్తారుకదా అని మీకోసం కూర్చున్నానండీ.

"ఏంకట్టివారండీ" అన్నాదావిడ నవ్వుతూ.

నవ్వుతూ అని, అన్నాక నవ్వింది.

కిలకిల కిలకిల జలజల జిలజిల నవ్వింది

ఆనవ్వుకి వెన్నెల సిగ్గుపడింది.

స్వర్గంలో దేవేంద్ర సింహాసనంమీద కూర్చున్నవాడు సుబ్బయ్య.

ఆమెగూడా ఆ సింహాసనం ఎక్కింది.

ఆవిడ దూరంగా కూర్చోలేదు.

సుబ్బయ్య ఎడంగా జరగలేదు.

"నే నిలా వస్తానని కలగానేరా ?"

"ఆఁ"

"అయితే నాక్కూడా కలొచ్చింది"

"ఏమంటుది ?"

"మీ రిలా అబద్ధాలాడతారని"

అసందర్భంగా ఉన్నట్టిన్నీ, అర్థం లేనట్టిన్నీ, నవ్వదగనిదిన్నీ, అయిన ఆ మాటకి ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఇంత రాత్రి అయ్యాక మీ రెక్కణ్ణించి వస్తున్నారు ?"

"సినీమా ఇప్పుడే విడిచేరు కాబట్టి ఇంతరాత్రయేక నేను వస్తున్నాను. కాని మీరు ఇంత రాత్రివేళ ఇంటికి వెళ్ళకుండా వంతెన గట్టు మీద కానేరేం ?"

"చెప్పేను కదూ! మీ కోసమే కాసుక్కూర్చున్నానని!"

నేనేనా ? నేనే మాట్లాడుతున్నానా ?

అతి స్వల్పంగా పరిచయం గల ఆడమనిషితో ఇలా పరిహాసాలాడుతున్నది నేనేనా?

"పోనిస్తురూ! సుబ్బయ్యగారూ! ... హాస్యానికేంగాని...అలా..."

"నా పేరు సుబ్బయ్యని ఎలా తెలిసింది మీకు ?"

"ఎలా తెలిసిందో చెప్పుకోండి, చూద్దాం"

"ఏమో !"

"చెప్పుకోలేరా ?"

"ఉహుఁ"

"ఆమాత్రం చెప్పలేరా! మీ అమ్మాయి కమల నా స్టూడెంటు కదండీ"

ఈ నిర్భాగ్యుడి పేరు తెలుసుకోవాలనే కుతూహలం ఈవిడకి ఎందుకు కలిగిందో! ఆశ్చర్యం!!

"అయితే మా అమ్మాయి నడిగేరా నా గురించి ?"

ఆవిడ సిగ్గుపడ్డాది.

"ఎంకెందు డిగేరు ?"

ఆవిడ ఇంకాసిగ్గుపడ్డాది'

ఆవిడ అలా సిగ్గుపడ్డందుకు సుబ్బయ్యకి సంతోషం, ఆశ్చర్యం కలిగి ఒక్కసారిగా ఆవిడ యందు ఆదరణ; అభిమానం, అనురాగం, ప్రేమ, వాంఛ వగైరా వగైరాన్నీ కలిగేయి;

"కానయితే, మీ పేరు చెప్పరుకారేం నాతో ?"

అందుకు జవాబుగా "తెలుసున్లెండి మీ సంగతి తెలుసు' అన్నాదావిడ తలా కళ్ళూ షోగ్గా తిప్పుతూ.

"ఏమిటి తెలుసు ?..."

"నా పేరు మనోరమని మీరు తెలుసుకొని తెలియనట్టుగా నటిస్తున్నారనీ..."

"అయితే మీ పేరు మనోరమా ?"

మొగవాళ్ళని ఆకర్షించడానికి స్త్రీలకి భగవంతుడు ప్రసాదించిన నేర్పంతా ప్రదర్శించిందావిడ తల ఊపడంలో.

కొంచెం సిగ్గు అభినయిస్తూ, తల ఆడిస్తూనే కిందికి దించింది. కాస్త పెదవులు కదల్చి నవ్వింది. ఒక్కరవ పెంకితనంగా వాలుచూపు వారచూపు చూపింది! జారనిపైట సర్దుకొంది.

"ఏం? నిజంగా ఇంతవరకూ నా పేరెరగరా మీరు ?"

నా పేరు కమల నడిగి తెలుసుకున్నాది. అలాగే ఆమె పేరు నే తెలుసుకున్నానని అనుకొంటోంది.

"ఎరక్కామీ !"

"అయితే మరి మళ్ళీ నన్నెందుకూ అడిగేరు ?"

"మీ నోటంట వింటే మధురంగా ఉంటుందని"

ఈరీతిగా, ఇంత సులభంగా నేను — సుబ్బయ్యని — నేనేనా మాట్లాడుతున్నాను ? ? !!!

"అబ్బ ! ఎంత గట్టివారండీ !"

అని తిప్పుకొంటూ తియ్యగా అన్నాదావిడి.

నేనా గట్టివాణ్ణి ? ?   నేను గట్టివాడినా ? ?

సుబ్బయ్యకి నవ్వొచ్చింది.

సుబ్బయ్య గట్టివాడంటే అనేకులు నవ్వుతారు. వేళాకోళంగా నవ్వుతారు.

సావిత్రి, వెంకటాద్రివు, అవధాని, రామస్వామి, ఎదటింటి మాస్టరు, పక్కింటి సూపర్ వైజరు అంతా నవ్వుతారు.

— మర్చిపోయేను— గవరయ్య నవ్వుతాడు.

గవరయ్య !   గవరయ్య !

గవరయ్యతో ఉన్న తగాయిదా అంతా నెత్తి మీద పెట్టుకొని ఈవిడతో ఇలా ఎలా మాట్లాడ గల్గుతున్నాను ?

ఆశ్చర్యం !   ఆశ్చర్యం !

"......అలా దీనంగా కూర్చున్నారేమండీ ? "

"ఎవరు" ? "

"మీరు"

"ఏమిటన్నారు ? "

"అబ్బ !   నా మాట వింటేనా మీరు ?   ఇందాట్లానే వచ్చినప్పటికి ఎందుకిలా దీనంగా ఉన్నారు ?   అలా అంత దీనంగా కూర్చోడం చూసి జాలేసింది స్మండీ నాకు"

జాలి !   జాలి !   జాలి !

ఈ విశాల విశ్వంలో సుబ్బయ్యని చూసి జాలిపడే వ్యక్తి సుబ్బయ్యే.

ఇంతవరకూ !

కాని, ఇప్పుడు—

ఈవిడకి నన్ను చూసి జాలి కలిగిందట ! !

జాలి ! ! !

ఎంత చక్కటి మాట !   ఎంత తియ్యటి మాట !

ఎంత చక్కటి తియ్యటి మనిషి ఎంత చక్కగా తియ్యగా అన్నాదా మాట ! !

ఎంత నిర్భాగ్యుడి గురించి అన్నా దామాట!!

ఆవిడ అలా అనగానే సుబ్బయ్యకి తన దురవస్థలన్నీ తలపుకి వచ్చి ఒక్కసారిగా దుఃఖం కమ్ముకొచ్చింది.

దుఃఖం కమ్ముకు రావడంతో నోట మాట పోయింది. కంట నీరు నిండింది.

నీరు నిండిన నయనాల్లోకి ఆమె వినీలనయనాలు జాలితో చూసేయి.

అతనికి దూరంగా లేని ఆవిడ అతనికి దగ్గరగా జరిగింది. అతని చెయ్యి చేతులోకి లాక్కుంది.

"అయ్యయ్యో! ఏమండీ సుబ్బయ్యగారూ, అలా వున్నారు?? వంట్లో బాగు లేదా? ఏమొచ్చింది? మాట్లాడరేం???"

ఆమెని ఒక్క సారిగా కౌగలించుకొని, తన హృదయానికి హత్తుకొని, లోకంలో అందరి హృదయాలూ కరిగేలా ఏడవాలనిపించిం దతనికి.

అలా చెయ్యలేక ఆమె చేతిలోంచి చెయ్యి తీసుకొని కళ్ళు తుడుచుకున్నాడు. తన చేతిని ఆమె పట్టుకున్నందుకు ఆశ్చర్యపడ్డం మర్చిపోయేడు.

"నా సంగతంతా చెప్తే తెల్లారిపోతుందండీ. అదంతా ఓ పెద్ద గాథ"

అతనికి ఇంకా దగ్గరగా వచ్చి అతని భుజం చేత్తో ఊపుతూ అడిగిం దావిడ:

నాతోకూడా చెప్పరా అనే భావంతో అడిగిం దామె, అందరికంటే సుబ్బయ్యకి తనే దగ్గర మనిషయినట్టు.

బాధలోనే సుఖంగా ఉంది అతనికి, ఆమె అలా దగ్గరకి వచ్చి భుజం మీద చెయ్యి వెయ్యడంతో.

పరిచయం చాలా తక్కువగల పరాయి ఆడమనిషి రాత్రి సమయంలో రోడ్డుపక్క వంతెన గట్టుమీద వెన్నెల్లో కూర్చొని వెచ్చగా దగ్గరగా వచ్చి భుజంమీద చెయ్యివేసి మాటాడ్డం అసందర్భంగా గాని, అసహజంగా గాని ఉన్నట్టు సుబ్బయ్యకి తోచలేదు

సహజంగానూ, సమయోచితంగానూ ఉన్నట్టే తోచింది.

"చెప్పండీ" అన్నాది మనోరమ.

ఎవరు చెప్పకుండా ఉండగలరు?

ఉండబట్టలేక ఉన్నదంతా చెప్పేసు సుబ్బయ్య.

అంతకు క్రితం సుబ్బయ్యని రెండుసార్లే చూసి, అతనితో ఒక్కసారే మాట్లాడిన మనోరమ అతని జీవితంలో తెలుసుకోవలసినదంతా తెలుసుకొంది ఆరాత్రి.

"మిమ్మల్ని చూస్తే నాకు నిజంగా జాలి వేస్తోందండీ"

ఆమె కళ్ళంట నీరు జారినట్టనిపించింది.

కాని అతను గమనించినట్టు లేదు.

ఆమెతో అంతా చెప్పడంతో అతనికి గొప్ప 'రిలీఫ్' కలిగింది.

అంతా చెప్పి అతను ప్రశాంతంగా కూర్చున్నాడు.

అర్ధరాత్రి అయింది. వంతెనమీద అక్కడా అక్కడా కూర్చొన్న కొద్దిమందీ ఎక్కడికో ఎక్కడికో పోయేరు మంచు కొంచెం పడ్డంచేత అంతటా చల్లగా ఉంది.

పద్దెనిమిదేళ్ళకుర్రవాడొకడు ఒకవైపునుంచివస్తూ, సుబ్బయ్యా మనోరమలవైపు చూస్తూ చూస్తూ వచ్చి పక్కకితిరిగిచూసి, వెనక్కి తిరిగితిరిగి చూస్తూ చూస్తూ వెళ్ళేడు.

ఈర్ష్యతో, క్యూరియాసిటితో చూస్తున్నాడు. చూసుకోంటూ పోయేడు.

నన్నుచూసి ఈర్ష్యపడుతున్నాడు.

అని అనుకోవడంతో సుబ్బయ్యకి ఎంతో ఉత్సాహం కలిగింది.

తీరని కోరికల్తో బాధపడుతూ వెళ్తుంటాడు.

ఆడామొగా ఇలా కూర్చున్నప్పుడు సుబ్బయ్య చూసేవాడు ఆలాగే.

ఇలా కూర్చోగలుగుతానని ఎన్నడైనా అనుకున్నానా?

కాని...

అర్ధరాత్రివరకూ ఈమెతో ఇలా కూర్చోడం బావుంటుందా?

హాయిగా ఉంది.

కాని, బావుంటుందా, అర్ధరాత్రివేళ !

"అర్ధరాత్రి అవుతూందండీ"

"అయ్యో! మీకు ఆలస్యం అయిందో ఏమిటో! ఇంతవరకూ కూర్చో పెట్టేశాను"

హాస్టే! అలా వుండాలి ఆడమనిషి మాటచమక్!

నా వెధవ గొడవలన్నీ వెళ్ళబోసుకొని, అనవసరంగా ప్రయాస బెట్టి, ఈమెని అర్ధరాత్రివరకు నేనాపేస్తే "కాదు! నావల్ల ఆలస్యం అయింది" అంటున్నాదీమె!

పాపం ఈవిడికి చాలా ఓపిక.

ఈవిడ చాలా మంచిమనిషి, పాపం.

ఈవిడది చాలా జాలిగుండె.

ఈవిడ పరులకష్టాల్ని చూసి సహించలేని మనిషి.

ఈవిడ సద్గుణాలరాశి.

ఈవిడ అందాలరాణి.

ఈవిడ నా పెన్నిధి.

ఈవిడ నా అదృష్టం.

హబ్బబ్బా! హాయ్యారే!

ఎంత హాయిగా ఉంది!

ఎంత విచిత్రంగా ఉంది!

ఇదంతా జరుగుతోందా ? ఆహా! జరుగుతోంది.

అయితే ఇదంతా ఎలా జరుగుతోంది?!!

దేవా! జగన్నాథా!

దేవీ! మనోరమా!

"మనోరమా, మనోరమా"

సుబ్బయ్యేనా ఇలా పిల్చినది ఎంత ఆశ్చర్యం! మెల్లగా మెల్లగా బరువుగా బరువుగా, వెచ్చగా వెచ్చగా ఆమె తల వాలింది అతని భుజంమీద.

వణుకుతూ వణుకుతూ అతని చేతులు చేరేయి ఆమె చుట్టూ.

కళ్ళు మూసుక్కూర్చున్నారు, అలానే. కళ్ళు తెరిచి గట్టుదిగారు అలానే. గట్టుదిగి నడుస్తున్నారు అలానే.

ఓయీ సుబ్బయ్యా! నీవు జాగ్రదవస్థలోనే ఉంటివా?

ఉన్నాను. లేను.

ఇదియంతయును స్వప్నమా? సత్యమా?

స్వప్నంకాదు. సత్యంకాదు.

కానిచో ఇంకెయ్యది?

సత్యమైన స్వప్నం. యధార్థమైన స్వప్నం. కలకాని కల. నిజమైనకల. కలగాని నిజం. నిజంగాని కలగాని కల. ఆగు! ఆగు! కల నిజమయినదా? లేక నిజమే కలగా మార్పుచెందినదా?

అబ్బబ్బ! ఈ చొప్పదంటు ప్రశ్నలు ఇప్పుడెందుకు?

క్షమించు. క్షమించు.

చెట్టపట్టాలు వేసుకొని సుఖంగా ఇంటికిపోనియ్!

పొందు పొందు సుఖముగ నుండుడు.

దగ్గరగా నడుస్తూ మాటాడుకోనియ్!

సరేసరే.

చిలకపలుకులు చెప్పుకోనీ!

సరే సరే.

కష్టసుఖాలు ఒకరినొకరు తెలుసుకోనీ!

సరే సరే.

వెన్నెల్లో వెచ్చగా నడవనీ!

సరే సరే.

ఈ స్త్రీగాత్రాన్ని అదిమిపట్టనీ!

సరే సరే, సరే సరే.

"మీ ఇల్లెక్కడ?"

ఆమె చెప్పింది.

"రండి అక్కడవరకూ కూడావస్తా"

"ఇంతవరకూ వచ్చేరుగద; ఇంకా ఎందుకు మీకు శ్రమ?"

"మీతో వస్తే నాకే శ్రమా ఉండదు"

"నామీద అభిమానంకొద్దీ అలా అంటున్నారు"

"నన్ను రావద్దంటున్నారు. నామీదమీకు... ఆ అభిమానం లేదా?"

"లేదుకాబట్టే మీతో ఇలా వస్తున్నాను"

నడుంమీద ఆనందపారవశ్యంలో గట్టిగా నొక్కేయి అతనిచేతులు.

నాల్గురోడ్ల జంక్షన్ వద్దకి వచ్చేరు. మర్రిచెట్టు వెలుగునీడల్లో నిల్చున్నారు. జనసంచారంలేని రోడ్డుమీద పంగన్నికి అడ్డంగావచ్చే మర్రిచెట్ల నీడలో నిల్చున్నారు ఎదురెదురుగా.

"అదేనండీ, నేనుండే ఇల్లు"

"అయితే వెళ్తారా!"

జవాబు చెప్పకుండా దగ్గరగా వచ్చింది. దగ్గరగా వచ్చిన అందమైన ఆడమనిషిచుట్టూ చేతులు వెయ్యక తప్పదు.

ఆకుల నీడల్లో చీకటివెలుగు కలసింది. వెలుగు నీడల్లో కళ్ళు మెరిసేయి. మనసైన వాసన వేసింది. మత్తుగా ఉంది.

ఎన్నడూ ఆడదాన్ని ఎరగనివాళ్ళాగ ఆమెని కౌగలించుకున్నాడు బలంగా గాఢంగా.

ఆమె పెదవులు ఉన్నాయి వెచ్చగా, తడిగా. తియ్యగా.

వీపు ఆమెది ఉన్నాది గట్టిగా మెత్తగా.

ఉన్నాదామె జాకెట్టు పొలుసుగుపొంగు మెత్తగా మెత్తగా.

మనోరమ ఉన్నది ఆమె అతిమధురంగా.

"నామాట విని ఇప్పుడు ఇంటికి రాకండి. అద్దెలవాళ్ళంతా లేస్తారు. అర్ధరాత్రి..."

గిర్ గిర్ గిర్ గిర్.

"రేపుసాయంకాలం రండి ఏం?"

ఏమి టేమిటి?

"రేపు సాయంత్రం ఒస్తారుగా"

"తప్పకుండా"

వెనుక వైపు నడుంమీదా మెడమీద చేతులువేసి అతణ్ణి దగ్గరగా లాగి గట్టిగా అదుముకొంది.

ఆమెజుత్తు అతని కళ్ళల్లో పడుతోంది.

ఆమె కుడిబుగ్గ అతని చెంపని ఆనింది.

ఆమె వూపిరి అతని వూపిరితో వేడిగా కలిసింది.

"ఇంక నన్ను వెళ్ళనివ్వండి! మళ్ళీ రేపేగా కలుసుకుంటాం! ఏమంటారు?"

"సరే"

ఆవిడ వెళ్లింది.

సుబ్బయ్య నీరసంగా నిల్చున్నాడు. అతనికి మతి చెడినట్టుగా ఉంది. నుదుటిమీద చెమట తుడుచుకున్నాడు.

"మనోరమా! మనోరమా!"

మనోరమ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"ఈవిడ అరితేరినమనిషి"

అనుకో లేదు సుబ్బయ్య.

---

# 9

మర్నాటి ఉదయం.

ఏడుగంటలయింది.

సుబ్బయ్య బుర్ర దిమ్మెక్కి బరువుగా ఉంది.

సావిత్రి వంటగదిలో ఉన్నాది. కమలా కిష్టుడు బడికి వెళ్లడానికి అప్పుడే తయారవుతున్నారు.

వంటగదిలోంచి గిన్నెల చప్పుడు, వీధిలోంచి వాహనాలు చేసే చప్పుడు వినపడుతున్నాయి.

గోడమీద గడియారం దీనంగా చూస్తోంది.

గదిలో మేజామీద మాసిన గుడ్డమీద పెట్టిన గ్లాసుమీద మూతగా పెట్టిన పాతపుస్తకపు అంచులు దీనంగా వేళ్లాడుతున్నాయి.

మూడుకాళ్ళు ఒకరీతిగా ఉన్న నాలుగుకాళ్ళ మంచంమీద చిరిగిన పరుపుమీద చిరగని దుప్పటిమీద చిరిగిన బనియను, చిరగని పెరాయీ వేసుకున్న సుబ్బయ్య దీనంగా కూర్చున్నాడు.

సుబ్బయ్య సంతోషంగా లేడు.

రాత్రి జరిగినదంతా అతని మనసుని కలచివేస్తోంది.

రాత్రిపొందిన సుఖం రాత్రితోనే పోయింది.

ఈ మనోరమ ఎవరు?

తల్చుకుంటే నాకే భయంగా ఉంది.

ఎటువంటిమనిషో. ఏమిటో!

నాగురించి అంతా ఆమెకి చెప్పేశాను.

ఆమెగురించి నాకు తెలిసినదేమిటి?

ఆమెది ఏలూరు. ఆమె ఇక్కడ స్కూల్లో టీచరు.

అంతే తెలుసునాకు.

అంతే తెలుస్తేనేం? ఇంకా ఏం తెలియాలి నీకు?

నిన్నరాత్రిలాంటి అనుభవం నీ జీవితంలో ఎన్నడైనా ఎరుగుదువా నువ్వు??

నిన్న రాత్రి, నిన్న నిన్న, నిన్న రాత్రి నిన్ను స్వర్గంలోకి, వైకుంఠంలోకి, కైలాసంలోకి ఇంకా ఇత్యాదుల్లోకి తీసుకుపోయింది కదా ఆవిడ !!!

అందుకు కొంచెమైనా కృతజ్ఞుడుగా ఉండక ఆమె తలపుకి వచ్చేసరికి బెదురుతూ భయపడతూ...

"ఆవిడ మళ్ళీ కనిపించకపోతే బాగుండును"

అనుకొంటున్నావా?

నీకు విశ్వాసం కూడా లేదు. నీకు సిగ్గులేదా?

ఉంది. నాకు భయంగా ఉంది. నాకు పెళ్ళాం పిల్లలూ ఉన్నారు.

నా ఇంటికివచ్చి నా పీకలమీద ఆవిడ కూర్చుంటే నేనేంచేసేది?

నీవు పిరికిపందవి. కృతఘ్నుడివి.

ఏదో ఉద్యోగం చేస్తూ నలుగుర్లోనూ గౌరవంగా మర్యాదగా కాలక్షేపం చేస్తూంటే ఈవిడ నన్ను నలుగుర్లోనూ.....

నీ గౌరవ మర్యాదలు ఏడ్చినట్టే ఉన్నాయి.

ఈరోజు గవరయ్యవచ్చి గుమ్మంలో నిల్చొని, నిన్ను టకాయించి, బూతులు తిట్టి కేకలు వేసినప్పుడు అందరికీ తెలుస్తుంది నీ గౌరవం, నీమర్యాదా.

అమ్మబాబోయ్ గవరయ్య సంగతే మర్చేను!

సుబ్బయ్యకి గుండె దడపుట్టుకొచ్చింది. వీధిలోకి వచ్చేడు, ఇంట్లో సావిత్రి కొరకొరలాడుతోంది. ఎదటింట్లో మాష్టరు పరిస్థితి ప్రమాదంగా ఉంది. అతని భార్య వెక్కి వెక్కి ఏడుస్తోంది. వీధిలో ఎవర్నో పిలుచుకుని వెళ్ళిపోయుండాలి. లేడిపిల్ల కనిపించలేదు.

"ఇవాళేనో చెడ్డరోజులా తోస్తోంది నాకు"

ఏం జరగనున్నదో ఏమిటో?

ఇవాళో రేపో గవరయ్య పిచ్చికేకల్తో వస్తాడు.

కోపంతో ఎర్రగా మండిపడతాడు.

ఎవరిదా కాదు ???

గవరయ్యో...!!! ???

హ్హాదు హ్హాదు!!!

బతికేను!

కాని గవరయ్యవస్తే ఏంచేసేది?

చేసే దేముంది? పోతాను.

మనోరమ దగ్గరికి పోతాను!

మనోరమ నాకు అండగా నిల్చొంటుంది.

అక్కడకే పోతాను. వళ్లో తలపెట్టుకు పడుక్కుంటాను.

నాకే భయమూ రానివ్వదు మనోరమ.

హ్హాబ్బ! గతి రాత్రి! హ్హాబ్బ!

ఎంత హాయిగాఉంది! ఆమె నాయందెంత మక్కువతో ఉంది! ఆమె ఎంత మధురంగాఉంది.

మనోరమ దగ్గరికిపోతాను.

ఇందాట్లా......

నేనో వెధవని! పరమ దుర్మార్గుణ్ని!

ఇందాట్లా ఎంతటి దురాలోచన్లు వచ్చేయి !!

నాది పాపిష్టి మనసు. ఎంత అమాయకురాలి గురించి ఎంత అన్యాయంగా తల్చేను!

అయినా ఈరోజు బాగులేదు.

అంతా చెడ్డగా ఉండేట్టుంది.

అని సుబ్బయ్య ఆలోచిస్తూ ఉండగా పోతన్న వచ్చేడు.

కొత్తదుస్తులు వేసుకున్నాడు పోతన్న. తెల్లటి వంక పాగాచుట్టేడు నోట్లో పొడుగాటి చుట్టతో తాజాగావచ్చి.

"దండాలు బాబూ" అన్నాడు.

అప్పుడే పంపించేడు మనిషిని. స్వయంగా రాలేదు. అదీ కొంతనయమే.

"ఏం పోతన్నా ఏమిటి విశేషాలు?"

"ఏం లేవు బాబూ" అన్నాడు అరుగుమీద కూర్చున్న పోతన్న.

"ఏమంటారు మీ గవరయ్య"

ఆరిపోతూన్న చుట్టని బాగా దమ్ములాగి ఆరి పోకుండా చేసేడు పోతన్న.

"ఇప్పుడు ఖాళీగా ఉన్నానండి"

"అదికాదోయ్! మీ గవరయ్యా......"

"ఏంచేస్తున్నాడో తెలీదండీ నాకు"

"ఏం?"

"వాడికొలువుకి దండం పెట్టి మానేశానండి"

"ఏమీ? ఏమీ?"

"మానేశా నండి"

"ఎందుకు మానేశావు?"

"వాడికీ నాకూ సరిపడ లేదండి"

ఏందుచేత?"

"సరిపడ లేదండి. అంతే"

"సరేలే. కాని ఎందుచేత సరివడ లేదూ అంట?

"తత్వాలు వేరయిపోయాయండి."

"అహాఁ అందుకా?" అన్నాడే కాని సుబ్బయ్యకి గవరయ్య కొలువు ఆతనెందుకు చాలించుకున్నాడో అర్థం కాలేదు. "సరే! నాకెందుకు? చెప్ప డానికి ఇతనికి ఇష్టంలేనట్టుంది" అనుకున్నాడు.

"అయితే ఇహ ఏమి చెయ్యదల్చుకున్నావ్"

పొగ వదుల్తూన్న పోతన్న కొంత సేపయాక చెప్పేడు.

"ఏవీ నిశ్చయం చెయ్యలేదండి. ఇంకానిన్న నే కదా తగువొచ్చింది"

అయితే ఇద్దరికీ తగువొచ్చిందన్న మాట.

"ఎందుగురించోయ్! తగువొచ్చింది?

పోతన్న చెప్పలేదు.

"ఏదో అయిపోయింది కదాబాబూ! మరి నన్నడక్కండి"

అడక్కండంటే అడక్కూడదన్న మాటే!

"సరేపోనీ! కానీ ఇంతకీ ఇప్పుడేం చెయ్యదల్చుకున్నావ్"

"చెప్పేనుకదా! ఏదీ నిశ్చయంచెయ్యలేదండి"

"అవునవును! సరే సరే"

పోతన్న చుట్టకాలుస్తూ కూర్చున్నాడు.

సుబ్బయ్య సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాడు.

ఎనిమిది గంటలే అయినా ఎండజాస్తిగా ఉంది. నీడపట్టున నడిచిపోతున్నారు వీధిజనం.

పక్క కిళ్ళీ దుకాణంవాడు "ప్రేమ" సినిమాలోని సరికొత్తపాట పాడుతున్నాడు.

ఎదటి కిళ్ళీదుకాణంవాడు "పెళ్ళిచేసిచూడు" సరికొత్త గ్రామఫోన్ రికార్డు పెట్టేడు.

ఈడొచ్చిన పిల్ల అరటిపండుతింటూ రికార్డు వింటోంది.

ఈడురాని పిల్లడు బెంచీమీద కూర్చొని బీడీ కాలుస్తున్నాడు.

వీధింకా ఇప్పుడు అలా మామూలుగానే ఉంది.

సుబ్బయ్యని మామూలు భయాలు పీడిస్తూనే ఉన్నాయి.

పని మానెయ్యనట్టు పోతన్న మామూలుగానే ఉన్నాడు.

"ఉగ్గుగుండల సంగతి ఏంచేశారండీ బాబూ" అని అడిగేడు పోతన్న.

"అదేనోయ్ ఆలోచిస్తున్నాను"

పోతన్న 'ఫ్రీ'గా ఉన్నాడు. ఇహ ఇతన్తో 'ఫ్రీ'గా మాట్లాడవచ్చు

"ఇప్పుడు మట్టుకి అమాంతంగా గవరయ్యొస్తే ఏం జేస్తారు?"

ఏం చేస్తాను?

మనోరమ దగ్గరకి పారిపోతాను.

అటువంటి మనిషి లేదు మరింక.

నామీద ఈగని వాలనివ్వదు.

నేనో వెధవని కాబట్టి ఇందాట్లా అలా భయపడ్డాను.

ఎంతమంచి దెంతమంచిది!!

అక్కడకే పోతాను.

వెళ్ళగానే కౌగలించుకొని ముద్దెట్టుకొంటుంది.

వెంటనే వళ్ళో పడుకుంటాను.
అక్కడకే, ఆమె యింటికే పోతాను.
గవరయ్యొస్తే ఏంజేస్తాడు?
అయిదువందలూ ఇమ్మని అడుగుతాడు.
అడగనీ, పదిసార్లు వందసార్లు వెయ్యిసార్లు, లక్షసార్లు అడగనీ.
నిల్చున్న పాట్న అయిదువంద లివ్వగలనా?
నేనేం జమీందార్నా? కంట్రాక్టర్నా?
అంత సొమ్ము ఇచ్చుకోగల్నా?
ఇవ్వలేనే! ఇవ్వలేను!
ఇచ్చుకోలేక పోయినప్పుడు ఇవ్వకపోతే తప్పేముంది?
ఇవ్వలేను! ఇవ్వను!
ఇవ్వను!!
గవరయ్య కబురు పంపిస్తే ఇవ్వనని చెప్తాను.
గవరయ్యే వచ్చి అడుగుతే—
ఇవ్వనని చె...కనిపించకుండా పారిపోతాను.
ఆఫీసులో ఎలానూ అడగడు.
పైన నేను కనిపించను.
మనోరమ దగ్గరకి పోతాను.
పోయి పైట వెనుక దాగుంటాను.
ఉంగరాల జుత్తులో ఇరుక్కుంటాను.
వళ్ళో పడుక్కుంటాను.
"గవరయ్యడుగుతే సొమ్మివ్వనని చెప్పెయ్యండి"
పోతన్న కూడా అదే సలహా ఇస్తున్నాడు.
మంచిమాట చెప్పేడు.
మంచిసలహా ఇచ్చేడు.
శాబాస్! పోతన్నా
"కాని, ఓయ్ పోతన్నా! అలా అనేస్తే గవరయ్య ఏంచేస్తాడంటావు?"

పోతన్న నోట్లోకి పొగపోయి పైకివచ్చింది.

"ఏం చేస్తాడు? ఏదో ఒకటి చేస్తాడు. అలా భయపడితే పీకలమీద ఇంకా కూర్చుంటాడు. సొమ్ము మళ్ళీ ఒస్తుందనే ఇచ్చేడా మొదట్లో! నేనెర గని సంగతా ఇదంతా!"

"అవునవును, బాగా చెప్పేవ్."

"అంచేత భయపడక 'ఇవ్వన'ని గట్టిగా చెప్పెయ్యండి"

"అలాగే మరి, అలాగే చెప్తా"

"లేకపోతే ఈ శని మిమ్మల్ని వదల్దు చూసుకోండి"

అని చెప్పి పోతన్న లేచేడు.

"అప్పుడే వెళ్తావా?"

"చిత్తం"

"మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావు?"

"ఇలా వస్తూనే ఉంటాను బాబూ"

"కనిపిస్తూ ఉండు స్మీ"

"కనిపించనా మరి"

అని నడిచేడు పోతన్న. నడుస్తూ సందు మళ్ళి కనిపించకుండా పోయేడు.

అతను ఉన్నంతసేపూ సుబ్బయ్యకి ధైర్యంగా వుంది. భయం ఎరగని మనిషిలా కనిపిస్తాడతను.

"ఈ మనిషి సాయంగా నిల్చుంటే మన కింకేభయమూ ఉండదు" అ నేట్టు చేస్తాడు. అతను ఉన్నంతసేపూ ధైర్యంగానే ఉంది. అతను వెళ్ళిన తరువాతకూడా కొంతసేపు ధైర్యంగానే ఉంది. కాని మరొక పావుగంటకల్లా అనుమానం భయం తలలెత్తేయి.

"ఇవ్వకపోతేసరి" అని అప్పుడు అనుకోడం సులభమే!

అనుకోడం చాలా సులభం.

కాని—

పెద్దపులిలాగ బొద్దుమీసాల్తో ఎదురుగా గవరయ్య నిల్చున్నప్పుడు ఎలా చెప్పడం ఆ మాట!

అంతటితో అయిపోలేదే!

అటు తరువాత?___

గవరయ్య ఊరుకుంటాడా?

తెలుస్తుంటే గవరయ్య ఎంతటివాణ్ణయినా సరే భస్మం చెయ్యగలడు.

అందుచేతా...

కొంతసేపు ఆలోచించేడు సుబ్బయ్య.

మరొక సిగరెట్టు కాల్చిపారేశాడు.

"సరే ఇలా చేద్దాం" అనుకున్నాడు.

పోతన్న చేత కబురు పంపిస్తాను.

నేను గవరయ్య ఎదట పడక్కర్లేదు.

"ఆయన సొమ్మివ్వట్టండి" అని పోతన్న వెళ్ళి చెప్పేస్తాడు.

పోతన్న ఎంతో మంచివాడు. నాకు ఆమాత్రం ఉపకారంచేసి పెట్టక పోడు.

కాని...

తరువాత గవరయ్యని ఎలా తప్పించుకోడం?

రోజూ ఆఫీసుకి వస్తాడు. కాని ఆఫీసులో ఎందుచేతనో ఎడంగా పిల్చిఅయినా అడగలేమనన్ను. తనమీదకూడా ఏమైనా వస్తుందేమోనని భయంకాబోలు. కాని ఇంటికి రాగలడు. ఇంటికివచ్చి అల్లరిచేస్తే అప్పుడేం చెయ్యడం?

మనోరమ ఇంటికి పోతాను.

కాని...

గవరయ్య అక్కడకూడా వస్తే??

వస్తే ఇంకేమైనా ఉందా !!!

మనోరమ హడలిపోదూ!!!

అవిణ్ణికూడా అల్లరి చేస్తేచేస్తాడు గవరయ్య.

ఏమిటి సాధనం?

సుబ్బయ్యకేమీ పాలుపోడంలేదు.

ఆఫీసుకి వేళవుతోందని కూడా అతడు తెలుసుకోలేదు.

"ఏంబావా! ఆఫీసుకి టైమవుతూన్నట్టుందే" అన్నాడు వెంకట్రావు.

అతనలా అడిగేవరకూ అతను వచ్చినట్టుగా చూడలేదు సుబ్బయ్య.

"ఆ, ఇదిగో, వచ్చేవా! రా కూర్చో"

"కూర్చోడానికి 'టైమ్' లేదు, కాని, నువ్వింకా రాత్రిసంగతిగురించే ఆలోచిస్తున్నావు కదూ?"

"అవునోయ్. అవునుమరి"

"ఆలోచనలన్నీ ఎత్తికట్టేసి నే చెప్పినట్టూ చెయ్యి"

నువ్వు చెప్పినట్టూ చెయ్యబట్టే నా అవస్థ ఇంతమట్టుకొచ్చింది.

"ఏమిటి. నువ్వు చెయ్యమనేది?"

"గవరయ్యకి సొమ్మివ్వకు"

ఇలాంటి సలహాలు నేనూ ఇవ్వగలను.

"నన్ను రోజూ అడుగుతున్నాడే"

"అడగనీ"

అడగనీ! సులువుగా అనేశావు. సొమ్ము నువ్వేపట్టుకు పోయేవు. కాని తెచ్చినది నేను. అందుచేత నిన్నా నన్నా అడుగుతాడు? అడిగేది నిన్ను కాదు కాబట్టి అంతసులభంగా అనేశావు "అడగనీ" అని.

"అడుగుతున్నప్పుడు ఇవ్వనని ఎలాచెప్పడం?"

"నోటితో"

ఛీ! అనుకున్నాడు సుబ్బయ్య తన మనసులో.

ఛీ! ఈలోకంలో ఎవ్వరికీ ఉపకారం అన్నది చెయ్యకూడదుగాక చెయ్య కూడదు.

పోనీకదా అని ఈ మనిషికోసం నోరువిడిచి చెయ్యిజాచి సొమ్ముసంపాదించి తెచ్చి చేతుల్లోపోస్తే, తిరిగి ఆ సొమ్ము ఇవ్వడం మానేసి సిగరెట్టు కాలుస్తూ దర్జాగా "సొమ్ము ఎగ్గొట్టు" అని సలహా ఇస్తున్నాడు.

అంటే అర్థం?

డబ్బుకోసం గవరయ్య నన్ను జెయిల్లో కూర్చోబెటినాసరే.

ఇతను, ఈ వెంకట్రావు, నా బావమరిది.

నాకు ఆసొమ్ము ఇవ్వడన్న మాట!

ఛీ! ఛీ!

"ఛీ! నీకు ధైర్యంలేదోయ్. నీతో ఏంచెప్పినా లాభంలేదు" అన్నాడు మౌనంగా కూర్చొన్న సుబ్బయ్యతో వెంకట్రావు వెళ్ళిపోతూ.

సుబ్బయ్యకి దుఃఖం వచ్చింది.

ఈ వెంకట్రావుకి సొమ్ము తిరిగి యిచ్చే ఉద్దేశం లేదు. నాదగ్గర సొమ్ము లేదు. అంతసొమ్ము నాకెవరూ అప్పివ్వరు. ఇచ్చినా తరువాత తీర్చుకోలేను.

తెచ్చినసొమ్ము తీరుస్తేనే గాని గవరయ్య ఊరుకోడు.

ఆహా! నుదుటిమీద రాత ఎవడు తప్పించగలడు? ఆరోజు వెంకట్రావు రాకముందు ఎంతహాయిగా ఉన్నాను! ఎంత సుఖంగా నిష్పూచీగా ఉన్నాను! ఈ రోజున ఇలా పీకలమీద కత్తితో ఉంటానని కలలో అయినా అనుకున్నానా?

చేతులారా చేసుకొన్నదానికి ఫలితం అనుభవించాలి.

అనుభవింపక తప్పదు.

అటు ఆఫీసులో చూస్తే రివర్షనొచ్చింది.

హెడ్ క్లార్కు పెద్దపులిలాగ మీద పడిపోతున్నాడు.

నరకంలో ఉన్నా ఇంతకంటే బావుంటుందేమో!

ఆరోజునపడ్డాను నరకకూపంలో!

ఇహ వేరే నరకం లేదనుకుంటాను!

ఇల్లాక నరకం! ఆఫీసొక నరకం! నా మనసంతా ఓ పెద్దనరకం!

ఈ నరకంలో నేనెందుకిలా ఉండాలి? కారణం ఏమిటి?

ఏమో! ఎవడు చెప్పగలడు?

ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే ఇహ తెల్లారి పోతుంది.

ఇహ లేచి ఆఫీసుకి పోవాలి.

సుబ్బయ్య లేచి, ఇంట్లోకి వెళ్ళి కొంతసేపటికి వీధిలోకి వచ్చాడు.

పగలు పదిన్నరగంటలకి వీధిలో మామూలుగా ఎలాఉంటుందో ఆరోజు అలానేఉంది.

సుబ్బయ్య రోజూలాగే ఆఫీసుకి వెళ్తున్నాడు.

సుబ్బయ్యలాగ ఎండలో నడిచేవాళ్ళు నడుస్తూనే ఉన్నారు. నడవని వాళ్లు బళ్ళల్లో, రిక్షాల్లో, కార్లలో పోతూనే ఉన్నారు. అంతా మామూలుగానే కనిపిస్తున్నారు.

నేనుకూడా వాళ్ళకి మామోలుగానే కనిపిస్తున్నానా?

అయివుంటుంది.

లేకపోతే వాళ్ళకేం తెలుస్తుంది? నేనెవరో వాళ్ళకేం తెలుస్తుంది?

సుబ్బయ్యనే మనిషి గవరయ్యనే మనిషికి అయిదు పండలు ఇవ్వవలసి ఇవ్వలేక బాధపడుతున్నాడని ఈ రోడ్డుమీద పోతూన్నవాళ్ళ కేంతెలుసు?

రిక్షాలో వెళ్తూన్నది మంగలేనా?

అవును మంగలే!

Barber, the Great !

ఈ బార్బర్‌కి ఈ సుర్బయర్ సంగతి తెలుసా?

ఈ బార్బయ్యకి ఈ సుర్బయ్య సంగతి ఎలా తెలుస్తుంది ?

నా శిరోభారమునుదీర్ప నాశిరోజములను బట్టి చించి కత్తిరించి చెండాడినాడే! కష్టించి ఒడలువంచి నామెడలువంచి నాసుదీర్ఘ శిరోజముల దున్రించినాడే! గబ్బువాసనతో ఘర్మ జలముల గబ్బువాసనతో నా నాసారంధ్రముల బ్రేల్చినాడే!

నాకింక పిచ్చెత్తుతుంది.

నాకు బాధగాఉందే! ఎందుచేత ? ఆమంగలి వాడికి తలనొప్పిగా ఉందా? ఉంటే, ఎందుచేత? ఉండకపోతే, ఎందుచేత ?

నా తలలోని బాధలు వాడి యొక్క నొప్పి ఉన్నట్టి లేదా లేనట్టి తలకి ఎందుకు తెలియవు?

తలా తలా అంత దగ్గరగావున్నా ఒకరి తలలోనిది ఇంకొకరికి ఎందుకు తెలియదు ?

ఎందుచేత తెలియదు?

భగవంతుణ్ని అడగాలి!

అడగడానికి అతనున్నాడా లేదా?

ఈ ప్రశ్నకి జవాబెవన్నడగడం?

అతణ్నే అడగాలి.

"ఏమయ్యా, సుబ్బన్నా!"

సుబ్బయ్య ఉలిక్కి పడ్డాడు.

ఉత్తరదిక్కుకి ముఖం పెట్టి, దక్షిణ దిక్కుకి గుర్రం తిప్పిచూస్తూ వచ్చేడు అవధాని.

"నువ్వటోయ్! ఎవరో అనుకున్నాను"

రామస్వామనుకున్నా వేమిటి? అలా తుళ్ళిపడ్డావు" అన్నాడు అవధాని నవ్వుతూ.

సుబ్బయ్య కెంతమాత్రం నవ్వురాలేదు.

అవధాని మాత్రం అలా కొంతసేపు నవ్వుతూనే నడిచేడు.

నడుస్తూ నడుస్తూ నవ్వులేని సుబ్బయ్య ముఖంలోకి చూసేడు.

"ఏం సుబ్బన్నా, ముఖం వేలేశావ్?"

"నా మనసు బాగులేదోయ్!"

"రామస్వామి తీసిన దెబ్బ ఇంకా మాన్లేదుటోయ్"

అన్నాడు అవధాని కొంటెగా నవ్వుతూ.

"అవునవును. నీకు నవ్వులాటలుగా ఉండదామరి"

"సరేలే. ఉడుక్కోకు. కాని సుబ్బన్నా ఓమాట. అడుగుతాను?"

"ఓ, అడుగు"

"గవరయ్యని ఆరోజు సొమ్ము అడిగేవు కదా ఎందుకడిగేవు?"

"వెంకటావు అడగమన్నాడోయ్! చెప్పేను కదూనీతో"

"గవరయ్యనే ఎందు కడగమన్నాడో నీకు తెలుసా?"

తెతెతెతె లులులును.

"గవరయ్య బిల్సు నీదగ్గిర అప్పుడు ఉన్నాయి. అవునా?"

"అవునవున్లే"

"అందుచేత నే వెంకటాద్రివు గవరయ్య నడగ మన్నాడని నీకు తెలుసు'

..................

"అందుచేత నే అడిగేవు. అడగ్గలిగేవు. గవరయ్యని"

"ఏమిటి?"

"డబ్బోయ్! డబ్బు"

అవధాని ఇవాళ ఇలా ఈరీతిగా తారుమారుగా మాట్లాడుతున్నాడెందుచేత వ్యాపారం పూర్తిగా మారింది... హెడ్ క్లార్కు ఉపదేశించేడా? ... ఎవర్నీ నమ్మకూడదు...

"సొమ్ము నీకోసం అడగలేదు. నిజమే"

"నాకోసం కానేకాదోయ్"

"అవును మీ బావమరిదికే ఇచ్చేవు"

"అవునోయ్! వెంకటాద్రివుకే ఇచ్చేను"

"కాని సొమ్ము గవరయ్య నీకేనా ఇచ్చేడు?"

"అవును"

"ఇవాళ మళ్ళీ అడుగు. ఇస్తాడేమో చూద్దాం"

"ఇవాళ కెందుకిస్తాడు?"

"ఎందు కివ్వడు?'

బిల్సు నాదగ్గిర లేవు కాబట్టి.

"ఏం మాట్లాడవు? ఇవాళ నీచేతిలో వాడి బిల్సు లేవు. ఆరోజున ఉన్నాయి..."

అవును.

"...అందులో ఏదైనా సదుపాయం చేస్తావని వాడనుకున్నాడు..."

అవును.

"...అలాంటి ఆశ వాడికున్నాదని నీకు తెలుసు."

అవును.

"...అందుకనే వాణ్ణి అయిదువంద లడగ్గలిగేవు..."

అవును.

"...వాడేఉద్దేశంతో సొమ్మిచ్చేడో నీకు తెలుసు..."

అవును.

"...మామా! సుబ్బన్నా మనం అనుకున్నంత అమాయకులం కామోయ్ మనం, సుబ్బన్నా! వాడు వేసిన దొంగలెక్కలన్నీ మభ్యపరిచి వాడికి నువ్వు సదుపాయం ఎప్పుడూ చెయ్యదల్చుకోలేదు. నిజమే! కాని వాడు, పాపం, ఆఉద్దేశంతోటే, అంటే తెలుసుకదూ నీకు,..."

లంచం, లంచం, లంచం.

"...ఆఉద్దేశంతోటే పాపం అయిదువందలూ నీ చేతుల్లో పోసేడని నీకు తెలుసు..."

అవునన్నను!

"కాని వాడి దొంగలెక్కలేవీ కప్పిపుచ్చ లేదే నేను!"

"కప్పి పుచ్చలేదు. నిజమే. అంటే, గవర్నమెంటుని దగా చెయ్యలేదు, నిజమే. చేసినదగా గవరయ్యని చేసేవు. అవునా?"

ఈ వధాని నన్ను దగా చేసేట్టున్నాడు.

"వాడివ్వడమూ తప్పులేదు. నువ్వు పుచ్చుకోడమూ తప్పుకాదు. వాడికొంచమైనా సదుపాయం—చెయ్యడాని కప్పుడే సీటు మారిందాయను ...పోనీ సదుపాయం చెయ్యకపోయినా ఫరవాలేదు. కాని నువ్విలా పసవలా ఉంటేమాత్రం, సుబ్బన్నా, రామస్వామిగాడే కాదు, అంతా హింసిస్తారు నిన్ను. చూసుకో!"

ఇప్పుడు మాటల్తో హింసిస్తున్నావు నన్ను, నువ్వు; మాట్లాడకపోయినా హింసిస్తుంది సావిత్రి.

రామస్వామి రావణాసురుళ్లాగ హింసిస్తున్నాడు.

అందర్నీ మించిపోయేడు, గవరయ్య.

హింస! హింస!

"పోనీ, నే నడగడం తప్పేనోయ్!"

"తప్పుకాదోయ్, అడగడం పుచ్చుకోడాల్లో ఏమీ తప్పులేదు"

‘‘అలాకాదు, తప్పేఅనుకో, తప్పేఅనుకో, ఒప్పేఅనుకో, అడగడం అడిగేను. ఇవ్వడం అతను ఇచ్చేడు. ఇచ్చినప్పుడూ సొమ్ము మళ్ళీ నాదగ్గర్నుంచి పుచ్చుకుందా మనుకున్నాడా?’’

‘‘ఎలా అనుకుంటాడు?’’

‘‘కాని ఇప్పుడు చంపేస్తున్నాడోయ్’’

‘‘ఎందుకు?’’

‘‘అయిదువందలూ తిరిగి ఇచ్చెయ్యమని’’

‘‘ఏమిటీ?!! తిరిగి ఇమ్మంటున్నాడా?’’

‘‘అవునోయ్’’

‘‘చిత్తం, చిత్తం, దాఖలు చేయించుకుంటాను’’ అనేశే ఉంటా వీపాటికి, అవునా?’’

‘‘అనక ఏ చేసేది?’’

నీలాటి చవట పెద్దమ్మ తప్పించి ఇంకెవడైనా అలా అంటాడా?’’

‘‘అనక తప్పింది కాదు’’

అనక తప్పింది కాదేం? ఎందుచేత? ఆడదాని కన్నా అర్థానం అవడంచేత నీలాటి వెర్రివెధవ ఎక్కడా ఉండడనుకో! ఆ వెధవ, దబాయించడం బాగుంది. నువ్వు హాతోస్మి, హాతోస్మి, అనడం మరీ బాగుంది...’’

‘‘ఏం చెయ్యడం చెప్పావురి’’

‘‘ఏం చెయ్యాలా? చెప్పు తీసుకొట్టాలి వాణ్ణి నిన్నూకూడాను.’’

‘అదికాదోయ్, అవధానీ! కొంచెం శాంతిద్దూ! కేక లెందుకూ వెయ్యడం? నాకు నీ సలహా కావాలి. కేకలు కాదు’’

‘‘కేకలు వేస్తానా? ఇంకా వేస్తానా?’’

‘‘అబ్బ! నే చెప్పేది వినవోయ్’’

‘‘సరే చెప్పు’’

సుబ్బయ్య చెప్పేడు.

‘‘ఇహ ఇవాళో రేపో వచ్చి పీకలమీద కత్తిలా కూర్చుంటాడు’’ అని ముగించేడు.

అవధాని విన్నాడు.

విన్నాక 'అమ్మ! దొంగవెధవ అంత దౌర్జన్యం చెయ్యబోతున్నాడేం?' అన్నాడు.

"చేస్తున్నాడు"

"నాతో ఇదివరకే ఎందుకు చెప్పేవు కావు?"

"క్షమించు మరి, పొరపాటే అయింది. కాని నన్నిప్పుడు ఏం చెయ్యమంటావో చెప్పు!"

వెంకటాద్రిపుగీ, సుబ్బయ్యనీ, గవరయ్యనీ బూతులు తిట్టినపిమ్మట సుబ్బయ్యకి సలహా ఇచ్చేడు అవధాని.

"వాడి కొక్క దమ్మిడీ ఇవ్వకు! ఇవ్వనని చెప్పెయ్! వాడేం చేస్తాడో నేచూస్తా. నీమీద దౌర్జన్యంచేస్తే ఆఫీసులో అందరిమీదా చేసినట్లే. అందు చేత "అయిదువందల్లోనూ ఒక్క కాణీ అయినా ఇచ్చేదిలేదు" అని చెప్పు కచ్చితంగా' నీకే 'ధోకా' రకుండానే చూస్తా"

"అంతేనంటావా?"

"అంతే!"

సరే! అవధానికూడా ఇదే సలహా ఇస్తున్నాడు.

సరే! ఇదే బావుంది.

లేస్తూనే అనుకున్నాను సొమ్మివ్వలేనని.

ఇవ్వకివ్వకని చెప్తున్నారు పోతన్నా, వెంకటాద్రిపూ, అవధానీ.

ఇవ్వనని గవరయ్యతో చెప్పగలనా?

ఇదేవచ్చింది నాతో చిక్కు.

అయినా ఫరవాలేదు! అనేస్తాను!

అవధాని ఆసరా ఉన్నాడు కదా!

అవధాని గట్టివాడు!

గవరయ్యని మింగెయ్యగలడు అమాంతంగా.

గవరయ్యొస్తే చెప్పేస్తాను!!!

# 10

ఆరోజు సాయంకాలం వీధిలో వేల జనంలో ఒకన్నగా సుబ్బయ్య నడుస్తున్నాడు.

తొందర తొందరగా నడుస్తున్నాడు.
తేలిగ్గా తేలిపోతూ పోతున్నాడు.
మాంచి హుషార్గా ఉన్నాడు.
బహుసంతోషంగా ఉన్నాడు.
అయ్యలారా! చెవులొగ్గి వినుడు!
Please lend me your ears,
వీనుల విందుగా నే చెప్పగా మీరు వినుడు!
“...శ్రీరామ రామా! ఒక్క కాణీ ధర్మం ఇప్పించండి.”
వినండి! వినండి!
“... శ్రీరామ రామా! తండ్రీ! ఒక్క కాణీ ..”
Hear! Hear!
“...దయచేయించవా ప్రభూ!”
రామ రామ శ్రీరామా రామా రామా రఘురామ కాణీ అయినా ఇవ్వను అనేశినాడండీ!
భళా భళీ...

అప్పుడా సుబ్బయ్య దొరవారు ఆ సేవ కాధమునితో ఇంకా ఏమని చెప్పినారండీ?
చాలా చెప్పినారండీ!!

“ఓరీ పోతురాజా! నీవుపోయి ఆ x పిరిగాడితో ఈరీతిగా చెప్పుమూ...
‘కాణీ దమ్మిడి టోలికూడా ఇవ్వడివ్వడంటు
అట్టే అడిగేవంటే నీకూ మొట్టికాయలంటు
తప్పవు తప్పవు తిట్లూ తన్నులు వారిచేతనీకు’”
ఓహో సుబ్బయ్యా!
ఆహాహా సుబ్బయ్యా!

ఎంతపని చేశావు?

మంచిపని చేసేవు!

"...నేడే ఆఖరిదినం! ఇదే ఆఖరి తరుణం! "మగ్గురుయోధుల నే చిత్రరాజాన్ని......"

యోధాగ్రేసరుడి వనిపించుకున్నావు.

ఆ నీచాధముడికి గుణపాఠం నేర్పేవు.

"...హల్లో న్యూస్ విన్నావా?"

"ఏమిటూ 'న్యూసు'?"

ఏమిటూ? నే చెప్తా మీరువింటే!

కాని ఎలా చెప్పటం వీళ్ళందరితో?

సుబ్బయ్యా గవరయ్యల విచిత్ర వృత్తాంతం వీళ్ళందరికీ ఎలా తెలియజెయ్యటం?

"...ఒరే; నా 'వేయిపడగలు' పుస్తకం ఏదిరా?"

"...'సారీ' రా బ్రదర్, ఒద్దంటూంటే వినకుండా మా అక్కయ్య ఢిల్లీ పట్టుకుపోయింది. నీతో చెప్దాం అనుకొంటూ......"

అనుకొని అనుకొని ఆఖరికి చెప్పేశాను.

ఎంతసుమ్మగా, ఎంత ఫస్టుగా, ఎంత ధైర్యంగా ఎలా చెప్పేశాను??!

అరిగంట క్రితమే అంతా జరిగింది.

ఆఫీసునుంచి అప్పుడే ఇంటికవచ్చేడు సుబ్బయ్యా. వచ్చేసరికి అప్పటికప్పుడే పోతన్న వచ్చి వీధి వరండాలో కూర్చొని చుట్టకాలుస్తున్నాడు. సుబ్బయ్య ఇంటికివచ్చి ఇంట్లోకి వెళ్ళేడు.

ఆ సమయంలో "సుబ్బయ్యాగారూ" అని వీధిలోంచి ఎవరో పిల్చేరు.

పోతన్న ఇంట్లోకి వచ్చేడు.

"నువ్వేనా పిల్చేవు, పోతన్నా?"

"కాదండి...పోతురాజొచ్చేడు"

"పోతురాజెవరు?"

"గవరయ్య మనిషండి"

"సుబ్బయ్యగారూ"...గట్టిగా పిలుపు.

అల్లరి, దెబ్బలాట, తిట్లు, కొట్లు.

"సొమ్ముకోసం ఒచ్చేడు; కాబోలోయ్ పోతన్నా!"

"లేకపోతే కులాసాగా ఉన్నారో లేదో కనుక్కుందామని ఒచ్చేడనుకున్నారా?"

ఏం చెయ్యడమోయ్, పోతన్నా!"

"ఇదెక్కడ వారండీ మీరు!! ఇంకా ఏంచెయ్యడమని! చేతులు నలుపుకొంటూ కూర్చుంటారేమిటి? ముందువెళ్ళి వాణ్ణి పంపెయ్యక"

"పోతన్నా!"

"ఏమిటండీ?"

"పోతన్నా! నాకు భయం వేస్తోందోయ్!"

"మాట చెప్పడానికే అలా భయపడితే ఎలాగండీ? ఇంతవరకూ ఎలా కాలక్షేపం చేసుకువస్తున్నారో ఏమిటో ఆశ్చర్యంగా ఉంది. ఇప్పుడు కాని మరి నసిగేరంటే లాభంలేదు. ఇలారండి. నేను పక్కనుంటాను. మరేం ఫర్వాలేదు. సొమ్మివ్వనని చెప్పేసి పోతురాజును తోలెయ్యండి." అని సుబ్బయ్య రెక్క పట్టుకున్నాడు పోతన్న.

పోతన్న వెనకాతలే వీధిలోకి వచ్చేడు సుబ్బయ్య.

సుబ్బయ్య తల తిరుగుతోంది.

ఎవరో ఏదో చెప్తున్నారు.

"...అడగమన్నారండి"

"ఎవరు"

"గవరయ్యగారండి"

"ఏమని అడిగేరు"

"సొమ్మండి సొమ్ము అడుగుతున్నారండి"

"ఏం సొమ్ము"

"మీరిస్తారు పట్టుకురమ్మన్నారండి అయిదువందలు"

నేనిస్తానని అనలేదే! (అబద్ధం! అబద్ధం!)

"వెంటనే ఇవ్వకపోతే తడాఖా చూద్దువుగాని, అని చెప్పమన్నారండి"

సరే. కాని నేను ఇవ్వలేను, ఇవ్వను, ఇచ్చుకోలేను మరి.

"గవరయ్యగారి సంగతి మీకు తెలియనట్టుందండి"

సుబ్బయ్య ఊరుకున్నాడు.

"గవరయ్య సంగతీ తెలుసు, నీసంగతీ తెలుసు. మరింక నోరుమూసుకొని నీదార్న నువ్వుపో" అన్నాడు పోతన్న.

"నీతో నేను మాట్లాడ్లేదు"

"కాని నేను నీతో మాట్లాడుతున్నాను. మరింక మాటలు మిగలక ఇంటికిపో"

పోతన్న అరుగు దిగనట్లుంది.

పోతిరాజు వెళ్ళిపోయినట్లుంది!

సుబ్బయ్యకి తల తిరుగునట్లుంది.

తిగగడం హెచ్చుతోంది. తగ్గుతోంది.

అంతా జరిగిపోయింది.

ఏది జరగడం అసంభవ మనుకున్నాడో అదే జరిగింది.

నిజంగా జరిగింది.

సుబ్బయ్య గవరయ్యని ధిక్కరించడం జరిగింది.

వచ్చినవాడు గవరయ్య మనిషే అనుకోండి.

పక్కనే పోతన్న ఉన్నాడనుకోండి.

అయినా చెప్పింది నేనే.

నానోటితో నేనే చెప్పాను.

మహాద్భుతం! పరమాశ్చర్యం!

నేనే ! నేనే!

బలే! బలే!

—ఏయ్ పిల్లా! చల్లగా ఎల్తున్నావు! బండికింద పడాలనుందేటి?

టక టక టక్ టక టక టక టక్ టక,

చల్లగా వెళ్ళేపిల్ల బండీ వాడివైపు వేడిగా చూసింది.

—తప్పుకోండి బాబూ, తప్పుకోండి.
సుబ్బయ్యా తప్పుకో నేది??!!
నువ్వు అప్పుడో వెదవా!
— ఏం సుబ్బయ్యా ఎక్కడకి వెళ్తున్నావ్?
ఇలా వెళ్తున్నాను—
...ఎక్కడకీ అంటు!
ఎందుకో వీడికి? వీడికి నేనా జవాబిచ్చేది?
ఇదిగో ఇలా వెళ్తున్నాను. వస్తాను మరి—
నే నెక్కడకెళ్తే వీళ్ళకెందుకో!
నా ఇష్టం వచ్చినచోటుకి వెళ్తాను.
ఎక్కడకి పడితే అక్కడకి.
ఎప్పుడు పడితే అప్పుడు.
ఇప్పుడు ఎంత వేళయింది చెప్మా?
అరున్నరయిందా?
అయివుంటుంది.
అయితే.
మనోరమ స్కూలునుంచి వస్తుందా?
ఇంటిదగ్గర ఉంటుందా?
సింగారించుకొని సిద్ధంగా ఉంటుందా?
నేను వచ్చేనని సంతోషిస్తుందా?
నన్ను కౌగలించుకొంటుందా?
నన్ను ముద్దులాడుతుంతా?
వేగిరం వేగిరం.
జల్దీ, జల్దీ.
నడిచి లాభం లేదు.
ఏయ్ రిక్షా
వేగిరం పద

ఇది బాగుంది.

సుబ్బయ్యకోసం ఒక సుందరాంగి

ఎదురుచూస్తూందని ఎవ రెరుగుదురు?

వెంకట్రావుకి తెలుసా? రామస్వామి ఎరుగునా? అవధాని ఊహించగలడా?

సుబ్బయ్య గట్టివాడు

ఎలా సంపాదించేడో కాని మంచితాన్ని తెచ్చేడు.

మంచిపిటని పట్టేడు.

భేష్! భేష్!

భేషుగ్గా ఉంటుంది!

సుబ్బయ్య అదృష్టవంతుడు.

ఆపరా, ఆపరా.

తలుపు తెరిచేవుంది.

ఇంద డబ్బులు.

నాకోసమే. ..

మరి మాట్లాడక ఫోరా!

తలుపు నాకోసమె తెరిచి వుంచింది,

కాళ్ళు తేలిపోతున్నాయి.

కళ్ళు చెదరిపోతున్నాయి

గుండెలు ఆగిపోతున్నాయి.

హదిగో! హదిగో!

గుమ్మంలో గుమ్మంలో.

మనోరమ! మనోరమ!

తెల్లగా చీర పచ్చగా రవిక!

చల్లగా చూపు! వెచ్చగా నవ్వు!

తెల్లగా పచ్చగా చల్లగా వేడిగా,

గుమ్మంలో నిల్చొన్న మనోరమ,

ఎవరికోసం నిల్చొని ఎదురుచూస్తోందో,

వారే వస్తున్నారు!

సుబ్బయ్యగారు వస్తున్నారు.

"మీకోసం చూసిచూసి కళ్లు కాయలు కాసిపోయాయండీ!"

హాదీ హాదీ హార్దదీ! హోదదాని ష్మాష్ హాల్లాష్వుండ్షాషి!

"రండి లోపలికి రండి"

రానూ మరీ! ఒస్తున్నా,

వెనక్కి తిరిగి ఇంట్లోకి దారి తీసింది.

నొక్కులు జుత్తులో మల్లెపువ్వులు మందహాసం చేస్తున్నాయి.

ఉల్లాసం కలిగిస్తున్నాయ్.

వెనకాతలే వెళ్ళేడు.

పొడుగ్గా సన్నగా ఇరుగ్గా వాకిలి.

అటూ ఇటూ గదులు.

ఒక్కొక్క గదికి. ఒక్కొక్క ద్వారం, ఒక్కొక్క కిటికీ!

అటు పది ద్వారాలు. ఇటు పది కిటికీలు.

గదులనిండా గదు లద్దెకి తీసుకున్న ఆడవాళ్ళు.

కొన్ని గదుల్లో ఆడవాళ్ళకి సంబంధించివ కబుర్లు చెప్తున్న, కామంతో చూస్తున్న మొగవాళ్ళు.

వాకిల్లో ఆరవేసిన చీరలు, జాకెట్లు, రవికలు బాడీలు, పరికిణీలు తువ్వాళ్ళు, దుప్పట్లు, గలీబులు, గుడ్డలు, ఎన్నోన్నో.

ఇంటినిండా ఆడవాళ్ళ

గడబిడ గలగల

కలకల కిలకిల

కోలాహలం!

ఆడవాళ్ళ కోలాహలం!

కిటికీలోంచి, గుమ్మాలనుంచి క్యూరియస్ గా చూపులు కిలకిల నవ్వులు.

"ఎవరెవరు? మనోరమే!" "ఆహాం!"

కుడిచేతివైపు చివరిగది.

"ఇదే నాగది. లోనికి రండి"

గదిలోపల విద్యుద్దీపం వెలుగుతోంది.

వెలుగులో కనబడుతున్నవి:

పొట్టిమడత మంచ మంచంమీద మెత్తటి పరుపు? పరుపుమీద తెల్లటి దుప్పటీమీద నల్లటి సిరామచ్చ, నల్లటి మేజాకాళ్ళు, మేజామీద నీలి గుడ్డ, శకునశాస్త్రము What men Think రాజూ-పేదా, ఆంధ్రవార పత్రిక, అంజలీదేవిబొమ్మ పైటిల్స్ కనిపించని పుస్తకాలు, ఆఫ్గన్ స్నో పౌడర్ డబ్బా, "6 × 12" అద్దం, ఇంకా ఏవేవో మేజామీద. గోడని ఒక మేకు కిటికీకి కట్టిన తాడుమీద పూర్తిగా మాయని బట్టలు మంచంక్రింద రెండు ట్రింకు పెట్టెలు, గుమ్మంలో రెండు జతల చెప్పులు.

గదివెనక ఇంకొక చిన్నగది. అందులోకి వెళ్ళడానికి ఇందులోంచి ద్వారంలోంచి కనిపించేవి ఇత్తడి, ఎల్యూమినియమ్ గిన్నెలు.

గదిలో గోడలకి రెండు బొమ్మల క్యాలెండర్లు రెండు ఫ్రేం కట్టిన ఫోటోలు.

క్యాలెండర్లెవరివి?

ఒకటి మహాత్మాగాంధీ; రెండు: నేతాజీబోస్ గాంధీగారి బొమ్మ పైన బుక్ సెల్లర్స్.

నేతాజీబొమ్మమీద బుక్ సెల్లర్స్ & స్టేషనర్స్. ఫోటోలు ఎవరివి?

ఒకటి: సన్నగా పల్చగా ఆరోజుల్లో ఉండే మనోరమ.

రెండు: లావుగా నిండుగా ఈ రోజుల్లోఉండే మీ మనోరమ.

గదిలో ఇద్దరూ నిల్చున్నారు.

ఒకరికళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు,

"ఇదా మీ గది!"

"అవునండీ"

ఆగదిలో వంట చేసుకుంటారా?"

"అవునండీ"

ఆ పైనా ఏమిటుంది?"

"రండి చూద్దురుగాని"

ఎడంవైపు చివరిగదిలోంచి ఎవరో చూస్తున్నారు.

ముందు గదిలో దీపం ఆర్పేసి వంటగదిలోకి వెళ్ళింది మనోరమ.

వంటగదిలో పొందిగ్గా పేర్చిన గిన్నెలూ, సామాన్లూ లీలగా కనిపిస్తున్నాయి.

"పెరడు చూద్దురుగాని రండి"

వంటగదిలోంచి పెరట్లోకి వెళ్ళేరు.

పది వాటాలవాళ్ళకీ పది పెరళ్ళు.

పెరట్లో కూడా వాటాకీ వాటాకి మధ్యగోడ.

ఎవరిమట్టుకి వారికంతా ఇమ్ముగా ఉంది.

పెరడు కూడా ఇమ్ముగా బాగుంది.

పెరట్లో చంద్రకాంతి మొక్కలు వరసగ్గా ఉన్నాయి.

వెల్తిగా వెలిగే చంద్రుడు ఆకాశంలో ఉన్నా లేనట్టుగా ఉన్నాడు.

అటుకంటే చంద్రుడివైపు చూస్తున్నాయి తెల్ల చంద్రకాంతలు.

ఎర్ర చంద్రకాంతలుకూడా ఆ చంద్రుడివైపే చూస్తున్నాయి.

"చాలా బావున్నాదండీ మీయిల్లు!"

ఏదో! ఎలావున్నా చవగ్గా దొరికిందండీ!"

"ఆహా! ఎంత అద్దె"

"పది"

"బావుందండి"

"కొంచెం ఇరుగ్గా ఉన్నాదనుకోండి. కాని ఏంచేస్తాం?"

అని ఆవిడ వంగింది, చంద్రుడివైపు చూసే చంద్రకాంతంకోసం.

రెండు పువ్వులు తీసుకొని లేచింది.

రెండు వణుకుతూన్న చేతులు ఆమె భుజాలమీద వెనకనుంచి వాలేయి.

తలమాత్రం వెనక్కి తిప్పి ఆమె నవ్వింది.

తనవీపు అతని గుండెలకి ఆన్చింది.

బరువుగా బరువుగా, హాయిగా హాయిగా.

"వాసన చూడండీ. ఎంత బావుందో!"

కుడిచేత్తో చంద్రకాంతల్ని అతని పెదవుల కాన్చింది.

ఎడంచేత్తో సిగలోని మల్లెపువ్వులు సర్దుకొంది.

మెడకొంచెం తిప్పి వారగా చూస్తోంది. ఆమె కళ్ళల్లోంచి ఎన్నో భావాలు బైటకి వస్తున్నాయి చిలిపిగా అల్లరిచేస్తూ.

భుజాలమీంచి అతని చేతులు ఆమె నడుంకి రెండువైపులా జారేయి. చేతులకి ఆ నడుం వెచ్చగా ఉంది. వేడిగా సువాసన వేస్తుందావిడ.

ఘాటుగావున్నా మధురంగా ఉన్నాది మల్లెపువ్వుల సువాసన.

"ఏం మనోరమా"

"ఏమండీ"

చంద్రకాంతన్ని ఆమె సిగలో తురిమేడు.

సిగ వెనక్కిపోగా ఆమె ముఖం అతనివైపు తిరిగింది.

నవ్వుబోయిన పెదవులమీద అతని కంపించే పెదవులు ఆనేయి, తడిగా వేడిగా.

బాగా చీకటి పడింది.

వెల్తిగా వెలిగే చంద్రుడు గర్వంగా చూస్తున్నాడు.

పెరట్లో చంద్రకాంతలు జాలిగా చూస్తున్నాయి.

పక్కింట్లో ఎత్తుగా గుబురుగా ఎదిగిన అంటు మామిడిచెట్టు చూడకుండా నిద్రపోతోంది.

దానిపక్కనే వున్న కొబ్బరిచెట్టు ఆకులన్నీ ముడుచుకొని మూగన్నుతో చూస్తూ పడుకోండికి సిద్దపడుతోంది.

ఎక్కడో కాని నూతులోంచి నీళ్లు తోడుతూన్న చప్పుడు అవుతోంది.

"శారదా! ఎక్కడున్నావే?" అని ఎవరో కేక వేసేరు.

పక్కవాటాలోంచి గాజులు చప్పుడు వినవస్తోంది.

పెదవులాన్చి ఆమెని బలంగా బంధించేడు.

పెరట్లో గోడకి అమర్చిన కొళాయిలోంచి నీటిబొట్లు రాల్తున్నాయి. కొళాయికి ఎడంగా పొళ్ళుపోదు రాతిగోడని పట్టుకొని పైకి లేస్తోంది. పాత న్యూస్ పేపరు ఇసకలో దొర్లుతోంది. మూడు చామంతిమొక్కలు పూతకి సిద్ధంగా ఉన్నాయి. పువ్వులు పూయని గులాబిమొక్కలు రెండు, తొందరగా ఎదిగిపోదామని తాపత్రియపడుతున్నాయి.

తనజీవితంలో అంతకుముందు అసలం అతను చూడలేదు.

సరికొత్తజాగా అతని కది.

సరికొత్తజాగలో వయసులో వున్న ఆడమనిషిని కౌగలించుకొని ముద్దులాడ్డం అలవాటు లేని మొగవాడికి గాభరాగా వుంటుంది.

సుబ్బయ్య గాభరా పడుతున్నాడు.

కాని అది ఆనందంవల్లనో, భయంచేతనో, కామోద్రేకంచేతనో, ఎందువల్లనో తెలియదతనికి.

గాభరాతో కళ్ళు మూసుకున్నాడు. కొంతసేపు అలానే ఉన్నాడు.

"గదిలోకి పోదాం రండీ" అన్నాది మనోరమ మెల్లిగా.

తన్కావకాలంలో ఎక్కువ చనవు చేసుకున్న ఆడమనిషి, యవ్వనవతి, తలలో మల్లెలూ, చంద్రికాంతలూ తురుముకొని, కళ్ళల్లో చిలిపినం పెట్టుకొని గదిలోకి రమ్మని ఆహ్వానిస్తే, ఇంకా ఆరి తేరని మొగవాడికి గాభరాగా ఉంటుంది.

సుబ్బయ్య ఆమె అలా అన్నందుకు సిగ్గుపడి, గాభరాపడి మొహమాటపడ్డాడు.

ఇద్దరూ వెళ్ళేరు ఇంట్లోకి.

ముందుగదిలో చీకటి.

ఎదుటవాటా చీకటిగదిలోంచి ఎవరో అంతసేపూ చూస్తూనే ఉన్నారు.

"కల్యాణికి వేరే పనేలేదు. అందరిగదుల్లోకి చూస్తూనే ఉంటుంది అలా అదేమిటో ఆ సరదా!" అన్నాది మనోరమ మెల్లిగా, చల్లగా తలుపులు వేస్తూ.

కన్నులు తెరుచుకొని కల్యాణి చీకట్లోంచి చూస్తోంది.

చూడకుండా మనోరమ తలుపులు వేస్తోంది.

చీకటి గదిలో పరపురుషుడితో మనోరమ ఏంచేస్తోందో,

కంటితో చూడలేని కల్యాణి ఊహాదృష్టితో చూస్తోంది.

చూడలేక బాధపడుతోంది.

ఊహించుకొని సంతోషిస్తోంది.

మనోరమ దగ్గరగా వస్తోంది.

దగ్గర దగ్గరగా సన్నాడి లేసులాగా వస్తోంది.

గుండెలు కొట్టుకుంటున్నాయి.

జోరుజోరుగా చప్పుడు చేస్తున్నాయి.

మనోరమ వచ్చింది.

రాగలిగినంత దగ్గరగా వచ్చి వీలయినంత దగ్గరగా అతణ్ణిలాక్కుంది.

మొగవాడి మెడచుట్టూ ఆడదాని గాజుల చేతులు. పొట్టకింద గుండెల్ని వత్తుకుంటూ రవిక తోసుకొస్తున్న ఎత్తుగుండెలు. సిగరెట్టు కాల్చే పెదవుల్ని నొక్కుతూ సిగరెట్టు కాల్చని మెత్తమెత్తటి పెదవులు. మెత్తమెత్తటి పెదవులవెనక గట్టి గట్టిగా పళ్ళు. కళ్ళల్లోకి కళ్ళు. పెదవులమీద పళ్లు. మెత్తగా గట్టిగా వళ్ళు

ఆవిణ్ణి పట్టుకున్నాడతను.

అతణ్ణి పట్టుకు వేళ్లాడింది ఆమె.

తూలిపోతున్నాను! తూలిపోతున్నాను!

పడిపోతాను కాబోలు!

ఇంత బరువుగా ఉండేమిటి??!!

నాకన్నా భారంగా బలంగా ఉండే!!

నాకన్నా పెద్దదికాబోలు.

అబ్బ! నాకు నీరసంగా ఉంది.

ఇంత చీకటిగా ఇరుగ్గా ఉండేమిటి ఇక్కడ!

ఉక్క ఉక్క! చెమట చెమట!

ఈ మనిషి సత్తువా, ఈ మనిషి మోటుతనం, ఈ మనిషి సాహసం చూస్తె భయంగా ఉంది!

కిందని నిల్చొని చేతులు వదిలింది ఆవిడ;
హమ్మయ్యా!
వదిలిం దెలాగయితేనేం?
ఇంకేం చేస్తుందో? నన్నేం చెయ్యమంటుందో?
ఏం చెయ్యడానికీ నాకు మొహం తిరుగుతోంది.
బలవంత పెడుతుంది కాబోలు
ఏందారి భగవంతుడా.
బైటకి పోవాలి! ఎలా పోవడం?
ఉక్కపోసేస్తోంది! చెమట! వెధవ చెమట!
రుమాలు మర్చిపోయేను.
రామచంద్ర! ఇప్పుడేం చెయ్యడం?
వెర్రివెధవలా ఇలా నిల్చుండిపోయేనే!
నవ్వుతుంది కాబోలు, నవ్వుతూంది కాబోలు.
అయ్యబాబ్బో! తలవంపులు! సిగ్గు సిగ్గు!
"ఏమండీ సుబ్బయ్యగారూ"
సుబ్బయ్య గొంతుకలో ఏదో అడ్డుపడింది.

"ఏమండీ? అలా నిల్చుండిపోయారేం? పిలిస్తే పలకరు! నామీద కోపం వచ్చిందా?"

"అబ్బే! అబ్బే!"

"మరే మలా వున్నారు?"

"ఏమీ లేదు, మామోలుగానే ఉన్నానే...కొంచం ఇక్కడ..."

ఆతని భుజంమీద చెయ్యివేసింది మనోరమ.

"అయ్యబాబ్బో! ఎలా చెమటపట్టేసిందో? కొంచెం విసరనా? అందులోనూ అంతదూరం నుంచి నడిచే వచ్చేరో ఏమోకూడా! ఎంతగా అలశారో యేమో! ఇంటికి వస్తే కాఫీ అన్నా ఇవ్వకుండా నేను......"

అంటూ లైటు వేసింది మనోరమ.

అతని నుదుటినుంచి స్వేదబిందువులు రాల్తున్నాయి.

సుబ్బయ్యకి ఎందుకో గాని ఎంతో చిన్నతనం అనిపించింది.

ముఖం దించుకొని నిల్చుండిపోయాడు.

విసనకర్ర తీసుకువచ్చింది మనోరమ,

"ముందు మీ గలా మంచంమీద కూర్చోండి"

కూర్చున్నాడు.

అతనికి విసురుతూనే వీవన అతని చేతికి అందిచ్చి "ఇదిలా తీసుకు విసురుకోండి". ఈలోపున అయిదు నిమిషాల్లో కాఫీ చేసి తెస్తా" అన్నాది.

"ఒద్దొద్దు! కాఫీ అక్కర్లేదండీ"

"మీ రెప్పుడూ అలానే అంటారు" అన్నాది మనోరమ నవ్వి, అతని ముఖం మీదికి వంగి, అతని బుగ్గని తాకి.

స్టవ్ వెలిగించిన పదిహేను నిమిషాల్లో కాఫీ తయారయింది.

సుబ్బయ్య తలలో ఆలోచన్లు అర్థం లేకుండా పరిగెడుతున్నాయి.

ఎందుకు వచ్చేను? ఏం చేస్తున్నాను? చేతకాని వాజమ్మలా కూర్చున్నాను...ఎవరీమె? నా భాగ్యదేవత! అవునా? అయితే "ఏల నింత భయము స్వామి" ఇక్కడ నే నిలా మంచం మీద కూర్చోడం అబద్ధమా నిజమా? పరుపు మెత్తిగా ఉంది. మనోరమ బరువుగా ఉంది. ఆడమనిషి అంత బరువుగా ఉండకూడదు. తలుపులు వేసే ఉన్నాయి. కల్యాణి చూస్తోందా? కల్యాణి బరువెంత? తలుపులు వేసుక్కూర్చుంటే అంతా ఏమనుకుంటారో! ఏమో! కొంపతీసి... నే నేం తప్పు పని చేద్దామనిరాలేదే (పచ్చి అబద్ధం) మాట్లాడదామని వచ్చేను...మనసిచ్చి మాట్లాడేది మనోరమ ఒక్కర్తే. అందుచే నా కష్టసుఖాలు చెప్పుకుందామని వచ్చేను. ఈరోజుతో గవరయ్య బాధ తీరిందని చెప్దామని వచ్చేను...

"మనోరమా"

"ఇదిగోనండీ కాఫీ"

"థాంక్స్! కాని, మనోరమా! గవరయ్యబాధ వదిలింది!!!"

"ఓహో! నిన్నరాత్రి చేప్పేరు! ఆ గవరయ్యేనా?"

తనుకూడా మంచంమీద కూర్చుంటూ అడిగింది.

"ఆఁ వాడే వాడితో దమ్మిడీ ఇవ్వనని చెప్పేశాను."

అబద్ధం! నువ్వు వాడితో చెప్పలేదు. పోతురాజుతో చెప్పేవు. అందు కైనా భయపడ్డాడు పోతన్న లేకపోతే చెప్పే లేక పోయేవాడు.

"మంచిపని చేశారండీ, ఖుషుగ్గా వుంది"

అతను కాఫీ తాగేడు.

ఆమె కాఫీ తాగింది.

రెండు గ్లాసులు మంచంకిందకి పోయేయి.

ఇద్దరు మనుష్యులు మంచంమీద కూర్చొనే వున్నారు.

వీవనతో అతనికి విసురుతోంది.

తనకి విసురుకొంటోంది.

అతని చెమట ఆరింది.

అతని గాభరా తగ్గింది.

"మనోరమా! నామీద నీకెందు కింత అభిమానం?"

"నాయందు మీకెందు కింత అభిమానమో ముందు మీరు చెప్పండి"

అని ఆపడ నవ్వింది.

విద్యుద్దీపం వెలుగులో తెల్లగా మెరుస్తోంది. తెల్లగా నవ్వుతోంది. ఋగ్గ చిల్లులు మనసు చలింప జేస్తున్నాయి. కట్టుకున్న తెల్లచీర ఇంకా తెల్లగా ఉండి పచ్చ రవికదగ్గర సిగ్గుపడి పక్కకి తప్పుకొంది.

పచ్చగా ఎత్తుగా, పచ్చగా పచ్చగా కళ్ళకి పచ్చగా............

"మనోరమా"

ఏమండీ

ఎంత హాయిగా ఏంత హాయిగా ఆడదానిమాట ఎంత హాయిగా, ఆడ దానివళ్ళు ఎంత హాయిగా ఆడదాని వాసన ఎంత హాయిగా ఆడదాని చీర ఎంత హాయిగా పచ్చగా పచ్చగా చెంపలకి వెచ్చగా వెచ్చగా.

ఆవిణ్ణి దగ్గరకి తీసుకున్నాడు.

ఇంటికి వెళ్ళేటప్పుడు కొంతదూరం ఆమెకూడా వచ్చింది.

వెన్నెల వెన్నెల, పుచ్చ పువ్వులా వెన్నెల. చేతుల్లో చెయ్యి చెయ్యి

కలిపిన మనోరమ. మృదువుగా హాయిగా, వెన్నెల్లో చల్లటిగాలి హాయ్ హాయ్ స్వర్గం స్వర్గం. స్వర్గంలా ఉంది.

ఇంకేం కావాలి నాకు!

విడిపోయేముందు "రేపు సాయంకాలం తప్పకుండా వస్తారుగా" అన్నాది మనోరమ.

"రాకుండా ఉండగల ననుకున్నావా?"

"ఏమో" అన్నాదామె కొంటెగా.

చేతిలోఉన్న చేతిని గట్టిగా నొక్కేడు.

"హాస్యాని కేంగాని, రేపు సాయంకాలం రావడం మర్చి పోకండేం! మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి"

అన్నాది మనోరమ కొంచెం సీరియస్ గా.

సుబ్బయ్యకి చలి వేసినట్లయింది.

ఒక్క క్షణం ఆగేక అన్నాడు.

"మర్చిపోను, వస్తాన్లే"

రాత్రి పదిగంటలయింది.

మనోరమ తెల్లచీరా పచ్చరవికా వెన్నెల్లో వెనక్కి వెనక్కి పోయేయి.

సుబ్బయ్య ముందు ముందుకి పోతున్నాడు.

ముఖ్యవిషయం! ముఖ్యవిషయం!

ఆనంద డోలికల్లో వూగిన అతనిమనసు "ముఖ్య విషయం" గురించి ఆలోచింపడంతో భారంగా కుంగిపోతోంది.

ముఖ్యవిషయం! ముఖ్యవిషయం!

పెళ్ళిచేసుకోమంటుందా???

కల్యాణి చూసింది. ఎంతోమంది చూసేరు.

ఇతనే! ఇతనే!

ఇతనే మా మనోరమని చీకటిగదులోకి తీసుకు పోయేడు!

రక్షించు భగవంతుడా!

మొన్న కాక మొన్న చూసేను. నిన్న కాక నిన్న మాట్లాడేను.

అప్పుడే ఇవాళ......

నిన్ననే ఒప్పుకోనేది......

ఏటువంటి కారెక్ట రీమెది !!

ముఖ్యవిషయం! ముఖ్యవిషయం!

డబ్బు! డబ్బు! డబ్బడుగుతుందేమో!

ఈవిడకీ నాకూ వున్న ముఖ్య విషయాలేమిటి?

రేపు తప్పక డబ్బిమ్మని అడుగుతుంది.

ఇహ, రోజూ కనిపించినప్పడల్లా డబ్బడుగుతుంది కాబోలు.

గవరయ్యక యివ్వక్కర్లేదని నేరకపోయి చెప్పేను.

వాడికి ఇవ్వనక్కర్లేదు కదా!

అందుచేత అయిదు వందలూ నాకే ఇవ్వండి అంటుందో ఏమిటో?

చచ్చేనన్నమాటే.

రేపు మరి వెళ్ళను.

రేపు సాయంకాలం మరి వెళ్ళను.

మనోరమకి మరి కనిపించను.

కనిపించేనంటే పీకేస్తుంది.

అయినదేదో అయింది!

చాల్చాలు !!!

కాని—

మనోరమకి నా యిల్లు ఎక్కడుందో తెలుసే !!

తిన్నగా ఇంటికి వచ్చేస్తే ఏం చేసేది ??

సావిత్రి నన్ను కూడా ఇంట్లోంచి గెంటేస్తుంది!

హరి భగవంతుడా! ఏం చేసేది?

ఇహ బుద్ధి తెచ్చుకుంటాను.

దొంగతనం రంకుతనం చెయ్యొద్దని ఊరికే అన్నారా?

గొప్ప పొరపాటయిపోయింది.

చేతులు కాలేక ఆకులు పట్టుకోడం.

నా సొదంతా చెప్పుకొచ్చాను.
ఆ మనిషి సంగతేమైనా అడిగేనా?
నేను బుద్ధిలేని వెధవని!
ఇప్ప డింక చేసే దేమీ లేదు.
ఇంటికిపోయి పడుక్కోడమే!
రేపు మాత్రం ఆవైపు కయినా వెళ్ళను.
ముఖ్యవిషయాలంట! ముఖ్యవిషయాలు!
వేగిరం ఇంటికి పోతాను!
చాలా ఆలస్యం అయినట్టుందే!
సావిత్రి ఏమంటుందో ఏమిటో?
ఏమనుకున్నా నాకేమాత్రం తెలదు!
ఈపాటికి పడుక్కునుంటారు.
బాగా రాత్రయిందే!
వీధులన్నీ నిర్జీవంగా ఉన్నాయ్!
ఒకానొక నిర్జనారణ్యములో ఒక పాంథుడు పోవుచుండగా......
నాకు భయంగా ఉంది.
పండ్లూడిపోయిన ముసలి టక్కరి పులి అతనిని చూచి......
వెన్నెల మసకమసక వెన్నెలగా మారిందేం?
ఓరీ పాంథా! ఈ పసిడి కంకణమును గొనిపోయి...
పక్కని రాళ్ళకుప్పలు. రోడ్డు బాగులేదే!
రా దగ్గరకు రా దీనిని గొనిపొమ్ము...
ఇలాంటి రాళ్ళకుప్పమీదే ఆరోజు పడ్డాను.
అమ్మో నాకు భయంగా ఉంది.
అంత నా దుష్టశార్దూలముచే...
ముగ్గురు కొడుతున్నారు నాలుగో మనిషిని.
అమ్మో! అమ్మో!
నా పాంథుడు భక్షింపబడియె.

నాకు భయంగా ఉంది.

తలవంచుకొని ఇంటికి వస్తున్నాడు సుబ్బయ్య.

తన యింటికి కొంచెం ఎడంగా ఆగిన మోటారుకారు వైపు చూడలేదతను.

ఇంటి గుమ్మందగ్గర సిగరెట్టు కాలుస్తూన్న మనిషిని సరిగ్గా చూడలేదు.

"ఏమండోయ్! మీరేనా సుబ్బయ్య"

"ఎవరూ? ఎరవెవరూ? నేనే నేనే నేనే"

"ఆహాఁ! మీరేనా?"

"అవునవును"

"అయితే చూడండీ బాబూ! చిన్నపనుంది ఇలారండి"

"పనుందా?"

"అవును"

"ఏమిటో చెప్పండి"

"చెప్తా! ఇలా రండి, బాబూ!"

మనిషి బలంగా ఉన్నాడు. ఎత్తుగా, జుత్తు. ఎత్తుగా మనిషి. పొట్టిగా నిక్కరు.

నాకు భయంగా ఉంది.

ఒకరాత్రి జనసంచారములేని వీధిలో సోమయ్యనే వృద్ధుడు సుబ్బయ్యనే బాలుని నడపించుకు పోవుచుండగా...

వీ డెవడో నాకు తెలియదే! మనిషి చూస్తే రౌడీలా ఉన్నాడు!

అకస్మాత్తుగా అంధకారమును చీల్చుకొని...

"ఎవరు మీరు? ఏంపని?"

రక్కసులవంటి ముగ్గురు మానుసులు...

"ఇలా రండి బాబూ"

అతను ముందుకి నడుస్తున్నాడు.

నేను రానురాను. నాకు రావడానికి భయంగా ఉంది.

కాని నా పాదాలు ముందుకి పోతున్నాయే! వాటిమీద నాకు స్వాధీనం తప్పినట్టుంది.

"ఏం కావాలో చెప్పవయ్యా వేగిరం?"
అని అడగనా?
"త్వరలో రండి"
రాను రాను. రా నేరాదు.
వస్తున్నా
"లోపల కూర్చోండి"
ఇదేమిటిది?
...వచ్చి నిర్దయతో వారిని చావమోదిరి.
మోటారు కారా ?
ఎక్కడో చూసేనే!
"కూర్చోండి బాబూ" తలుపు తెరిచేడు అతను.
"కార్లోపల ఎవరు కూర్చున్నారు?
ఎర్రెర్రగా సిగరెట్లు వెలుగుతున్నారే !
ఎర్రగావుందే ఈ కారు!!
"బాబోయ్! నేరాను! బాబోయ్ ! "
"ఎక్కడకే పోతావ్రా?"
గుంయ్ఁ గుంయ్ఁ గుంయ్ఁ
సుబ్బయ్య కళ్ళు చీకట్లు కమ్మేయి.

154

# 11

నేను ఎక్కడ వున్నాను?

ఎక్కడ ఉన్నాను నేను!

సుబ్బయ్యకి జరిగినదేమిటో గుర్తుకు రావటంలేదు.

జరిగినదంతా అతనికి పూర్తిగా గుర్తుకు వస్తోంది.

నే నెక్కడున్నాను?

పర్వతంమీంచి పడిపోతున్నాను.

సముద్రంలో మునిగిపోతున్నాను.

ఉన్న బలం అంతా ఉపయోగించి నా తలమీద సమ్మెటలతో ఇనప సమ్మెటలతో ఎవరు కొడుతున్నారు?

దెబ్బలు!!

ఇందాట్లా ఎవరు ఎవర్ని కొట్టేరు?

అల్లప్పుడు నాన్నని ఎవరు కొట్టేరు?

ఇందాట్లా నన్ను కొట్టేరా?

లేదే! భయపించేరా? అంతేనా!

కాని నొప్పి! ఒళ్ళంతా నొప్పి!

నొప్పి నొప్పి తెగనొప్పి!

చస్తాను కాబోలు.

ఊఁహూఁ! చావురాదు!

నాకు చావురాదు!

నారాత ఇలా వుండగా...

ఏమిటి చెప్మా రాయించేరు...

నాచేత నారాత రాయించేరు.

—రాయ్‌రా! రాస్కెల్!

— సంతకం చెయ్‌రా గాడిదా

—చేస్తావా చెయ్యవురా?!

మృత్యువు ఎరు పెక్కిన కళ్లు.

తాగుడువల్ల ఎరుపెక్కిన ముప్ఫయికళ్ళు
చూస్తూఉండగా
మరొక జత ఎరు పెక్కిన కళ్ళు గల తాగుబోతు చేతిలో సుబ్బయ్య
పొడుగాటి నల్లటిజిహ్వ.
అదే గవరయ్య కుడిచెయ్యి!!
—చెయ్‌రా డర్టీ రాస్కెల్!
దండాలుబాబూ! నమస్కారాలయ్యా నాయనా!
మీకందరికీ నమస్కారాలు!
చంపెయ్యకండి బాబూ! పిల్లలుగలవాణ్ని!
—ఎందర్రా?
—ఇద్దరే? ఇంతే? హోహ్హోహ్హో హ్హాహ్హాహ్హా!
—ఎక్కడార్రా వుంది నీ పెళ్ళాం?
కంపు కంపు కంపు నోళ్ళు!
సాః త్రిని రక్షించు దేవదేవా!
—రాసేవా?
రాసేనండీ రాసేనార్రి సేన్!
సంతకం పెట్టవేమిరా ఇడియాట్
—పెడతాను బాబూ పెడతాను
—ఏదీ సైకోసారి చదువు. అంతా వింటాం!
చదువుతా స్చదువుతా స్చదువుతా స్చదు...
...ఆగురా వెధవా ఏమిటా వెర్రిధోరణి.
చిత్తం చిత్తం.
—చదువ్వేగిరం!
చిత్తం. అక్షరములా వెయ్యిరూపాయిలు...
అడిగిన తక్షణం చెల్లించి......సుబ్బయ్య వ్రాలు
సాయులు...
—ఇప్పుడేమంటావురా?

— గాడిద కొడకా!

—అయిదువంద లెగ్గొడదామని చూసేవేం?

—హాహాహా హాహా నవ్వొస్తోంది ..కొడుకు ఇంక వెయ్యిచ్చుకోవాలి.

—నాకు నవ్వొస్తుందిరా.

పదహారుమంది తాలూకు కర్కశ కంఠాలు తిస్తే తిడుతున్నాయి.

బిగించిన పిడికెళ్ళు ఘల్ ఘల్ మని మీద పడుతున్నాయా?

నేను చచ్చిపోతాను.

నాన్న చచ్చిపోయాడు.

వీళ్లు నన్ను చంపేస్తారు

కమాలా! కమలా!

క్రిష్ణుడడీ!

మనోరమా! మనోరమా!

కొండలకింద నలిగిపోతున్నాను.

మరిహ బతకను. లాభంలేదు.

అందర్నీ అడిగేనని చెప్పు.

రెయిలుపట్టాలు గొలుసు ఛెయిన్లు.

ఇనప్పట్టాలమీద ఇనపగొలుసులు

వేసి కట్టేసి పడేశారు!

ఇనప చక్రాల మెయిలుబండీ

వస్తోంది! వస్తోంది!

కంఠానికి దగ్గరగా దగ్గరగా!

రక్షించండి! కాపాడండి!

మీ కాళ్ళకి వెయ్యివేల నమస్కారాలు!

ఎలా గెలా గెలాగ?

దయలేదు. దాక్షిణ్యంలేదు. జాలిలేదు. హృదయంలేదు.

వీళ్ళు మనుష్యులు కారు కారు కారే!

పశువులు పశువులు అడివి జంతువులు!

రౌడీలు గూండాలు రాక్షసులు
—ఫో! ఇంటికి ఫో!
వెళ్తాను. వెళ్తాను.
కాని నేను లేవలేను.
చస్తా న్నస్తాన్
...ఈ వేధన, భయంతో గుండెలాగి చచ్చేట్టున్నానే!
— ఇంటికి తీసికెళ్ళి ఒదిలెయ్యండి.
...ముందిక్కణ్ణించి ఈడ్చి పారెయ్యండి.
ఎక్కడ? ఎక్కడ?
నేనెక్కడ ఉన్నాను?
నా యింటి మెట్లమీద ఇక్కడే ఉన్నానా?
నన్నిక్కడే పడేశారు!
విసిరేశారు!
ఈడ్చి పారేసి
విసిరి పడేశారు.
"కమలా! తలుపుతియ్యి కమలా"
అనలేక పోతున్నానే!
మూలుగు వస్తోందే
మాట రావడం లేదేం ??
తలుపు తెరిచేరా ఎవరైనా?
తెరవకపోతే ఇంట్లోకి ఎలా వచ్చేను?
నాన్నా నాన్నా
అని ఏడుస్తున్న దెవరు?
అయ్యో అయ్యో
అని అంటున్న దెవరు?
కమల (క్రిష్ణుడు సావిత్రి)

బాధ బాధ
నొప్పి నొప్పి
"నాన్నా నాన్నా ఏమయింది నాన్నా"
"ఏమయిందండీ"
సావిత్రికూడా ఏడుస్తోందా
లేదు ఏడవడం లే.
కాని భయపడుతోంది.
అవును. నాకు తెలుసు.
అంతా భయపడుతున్నారు.
నాబాధచూచి భయపడుతున్నారు.
చచ్చిపోతానేమోనని భయపడుతున్నారు.
చస్తాను! ఎలాగా చస్తాను!
"ఏమయింది? ఏమిటయింది? ఎందుచేత మాట్లాడరు"
ఏమయిందని ఎవరో అడుగుతున్నారు.
చెప్పలేను. చెప్పలేను. చెప్పలేను.
ఏమయిం దేమయిం దేమయిం దేమయిం దేమయిందే............
హాబ్బా! చెప్తాను చెప్తా నెప్తా న్చెప్తా న్చెప్తాను.
ఏమయిం దేమయిం దేమయిం.........
"పడిపోయానరాత్రి పడిపోయేను"
అబద్దం అబద్ధం! అబద్ధం చెప్పేను.
వీళ్ళు ఊరుకుంటారా?!
ఎక్కణ్ణిం చెక్కణ్ణిం చెక్కణ్ణిం చెక్కణ్ణిం చెక్కణ్ణిం చెక్క
"జట్కామీంచి"
పచ్చి అబద్ధం పచ్చిగా అబద్ధం పచ్చడవని అబద్ధం.
ఇంక దయుంచి నన్నేమీ అడక్కండి
నన్నొదిలేయండి. నేను ఛస్తున్నాను.
నన్నేమీ అడక్కండి.

ఛస్తున్నాను. బాధపడుతున్నాను.
చస్తూ బాధపడుతూ
అబద్ధాలాడుతున్నాను.
చావబోతూ అబద్ధం చెప్పేను.
చెప్పేను అబద్ధం చావబోతూ
చావబోతూ బోతూ అబద్ధం చెప్తూ చెప్తూ చస్తాను.
చెప్పేది అబద్ధం,
చావబోయేది నిజం.
చావే కాదు ఈ బాధ కూడా నిజం.
నిజంకన్న నిజం చావుకన్న నిజం అబద్ధంకన్న నిజం ఈ బాధ!
మనిషి మాట అబద్ధం
మనిషి బాధ నిజం
మనిషి చావు నిజం.
అబద్ధపు బతుకు బతుకుతూ నిజం బాధలు పడుతూ అతినిజంగా చస్తాం.
వీళ్ళంతా భయపడుతున్నారు.
ఎందుకెందుకు?
నే చస్తానని!
వెర్రి వెధవలు!
అయినా వీళ్ళనని లాభం లేదు.
ఎలాగా భయపడతారు వీళ్ళు.
మనిషికి భయం ఎలానూ తప్పదు.
మనిషికి చావుకూడా ఎలానూ తప్పదు.
నే చస్తానని వీళ్లు భయపడ్డం...
కమలా క్రిస్టా సావిత్రి,
కొంచెం మంచినీరు!
గొంతుక ఎండిపోయింది.
"ఇదిగో మంచినీరు"

బాబ్బాబ్బ! హమ్మా! హయ్యా!
హాయ్ హాయ్‌గా ఉంది!
ప్రాణం లేచి లేచి వస్తోంది.
కన్ను మూతమూత పడుతోంది.
ఎవరో వస్తున్నారే!
ఎవరెవరో వస్తున్నారే!
ఎవరది?
ఎవరెవరది?
ఎంతసేపయింది నేనిక్కడికి వచ్చి?
ఎన్నాళ్ళయింది నేనీలోకంలోకి వచ్చి?
ఎంతకాలం ఇలా బ్రతికివుంటాను?
మీరు చెప్పగలరా?
చెప్పలేరా!
అయితే మీ రెవరు?
ఎవరో హాం మీరు?
ఇపుడా నను పలుకరింతురు?
మంచంమీద పడుకున్నానని
చస్తూ పడుకున్నాననీ తెలీదూ?
ఎవరు మీరు? మీ రెవరు?
"హాల్లో! హాల్లో!"
"What is all this"?
ఓహో ఓహో డాక్టర్ గారా!
గుండెలమీద స్టెతోస్కోపు ("డాక్టర్ డాక్టర్")
కడుపుమీద చల్లటిచెయ్యి ("డాక్టర్ డాక్టర్")
"మరేం. ఫర్వాలేదు" ("డాక్టర్ డాక్టర్")
అబ్బా నొప్ప నొప్పి, డాక్టర్ డాక్టర్

"అబ్బే! దెబ్బలూ గిబ్బలూ ఏమీ లేవండీ! He is Quite all Right! కొంచెం 'షాక్' అయేడు మనిషి. అ effects కన్పిస్తున్నా యంతే

నిద్రకి మందిస్తాను! మరి నే వస్తా"

డాక్టర్ వెళ్ళారా?

కమలా ఏడవకే!

క్రిష్ణా పడుకోరా!

మీరు కూడా పడుకోండి.

ఇదిగో ఇది తాగండి.

మరింక పడుకోండి.

బాధా లేదు గీధా లేదు. సిగ్గు లేకపోతే సరి.

పడుక్కోండి.

పడుకున్నానే గా?

నిద్ర రాదే

రాదే నిద్ర రాదే

నిద్ర రాదే నిద్ర రాదే నిద్ర నిద్ర రాదే రాదే...

♦ ♦ ♦

మర్నాడు. శనివారం. ఉదయం.

సుబ్బయ్య తల భారంగా ఉన్నాది.

సుబ్బయ్య మనసు భారంగా ఉన్నాది.

సుబ్బయ్య ఒళ్లు నొప్పిగా లేదు.

గత రాత్రి అంతా కలిసి, గవరయ్యింట్లో అంతా కలిసి చంపేస్తా

రేమోనని భయపడ్డాడు,

ఎవరూ కొట్టలేదే!

సిగ్గు సిగ్గు వెధవది సిగ్గు సిగ్గు

జుత్తు పట్టుకున్నాడు.

గవరయ్య సుబ్బయ్య జుత్తు పట్టుకున్నాడు.

వెధవ బ్రతుకు!

నరకం! యమయాతన!

కొట లేదు! నిజమే? కాని అంతకన్న ఇంకేం కావాలి!

ఇంకేం చెయ్యాలి.

అందర్లోనూ బలవంతంగా రాయించేడు.

ఎవరో వాళ్ళు ? ఏమో!

"కాని ఏంచేసేది రాయక"

అయిదు వందలు ఇచ్చుకోనక్కర్లేదు.

వెయ్యి రూపాయిలు మాత్రం నిక్కచ్చిగా ఇచ్చుకోవాలి !!!

"ఎలా ఇచ్చుకోగలది?"

సుబ్బయ్య తల భారంగా భారంగా ఉన్నాది.

సుబ్బయ్య తల తీవ్రంగా తీవ్రంగా పని చేస్తోంది.

ఆతని తలలోని ఆలోచనలు జోరుగా జోరుగా పరుగెడుతున్నాయ్.

గోడమీద, సుబ్బయ్య గదిలో గోడమీద గడియారం మెల్లిగా మెల్లిగా నడుస్తోంది.

నెమ్మదిగా నెమ్మదిగా కదుల్తూన్న ముళ్ళు తొమ్మిది తొమ్మిదే అవుతోందని చెప్పగా,

గడియారం విధిలేక విధిలేక తొమ్మిది గంటలు కొట్టింది.

ఆతని తలలోనికి ఎవరో ఠంగ్ ఠంగ్ మని కొట్టినట్లయింది.

ఎవరు కొడుతున్నారు ?

ఎవరూ కొట్టలేదే!

అవును ఎవరైనా కొడితే తల ఇంత తేలిగ్గా ఉంటుందా ?

సుబ్బయ్య తల ఒక్కసారిగా తేలికయింది.

ఎంత తేలిగ్గా ఎంత హాయిగా ఉంది !

ఛా! ఛీ! ఛూ

సుబ్బయ్య ఒక్కసారిగా అటునుంచి ఇటు తిరిగేడు.

ఎందుకింత భయం నాకు ?

భయం మనిషికి తప్పదు.

బాధ మనిషికి తప్పదు.

తప్పనప్పుడిహ భయమెందుకు?

అయిదు వందలు పది వంద లయింది

అవుతే అవనీ !

పది వేలవనీ !

అయిందేదో అయింది.

భయపెట్టి నాచేత రాయించేడు.

నేను రాసేను.

భయపడి రాసేను.

ఏదో ఒహా టవుతుంది.

భయం ప్రతివాడికీ వుంటుంది.

ఆఫీసులో ఆడగడానికి గవరయ్య భయపడలేదూ!

ఇవాళ నాచేత రాయించగానే సరా?

ఏదో ఒకటవుతుంది?

అనుకొని అనుకొని బాధ పడి పడి.

మరిహా లాభం లేదు.

♦ ♦ ♦

ఆరోజే తరువాత సుబ్బయ్య చెప్పేడు. రాత్రి జరిగినదంతా సవిస్తరంగా చెప్పేడు.

పోతన్న, వెంకట్రావు, అవధాని, మనోరమ నలుగురితోనూ చెప్పేడు.

పోతన్న సుబ్బయ్య చెప్పినదంతా విన్నాడు.

అందుకు. అంటే, గవరయ్య చేసినదానికి అతను ఆశ్చర్యపడలేదు. కోపం ప్రకటించలేదు.

పోతన్నతో చెప్పిన తరువాత భోగట్టా అంతా సుబ్బయ్య వెంకట్రావుతో చెప్పేడు.

వెంకట్రావు కోపంతో మండిపడిపోయేడు.

ఆఫీసులో అవధానికి భోగట్టా తెలియజేసేడు.

అవధాని కోపంతో గవరయ్యని బూతులు తిట్టేడు.

సాయంకాలం మనోరమతో చెప్పేడు.

తనకు కలిగిన కొత్తబాధ ఆమెకి తెలియజేద్దామనే ఆత్రతలో ఆమె గతుందు కలిగిన కష్టం గురించి మర్చిపోయేడు సుబ్బయ్య.

ఆమెకూడా అతను చెప్పినది వినడంలో తన విషయం మర్చినట్లుంది.

"అయ్యొయ్యొ! మీతో చెప్పడం మర్చి పోయేను, కాని నిన్ననే జ్ఞాపక మొచ్చిందండీ! ఈ గవరయ్య మావూరువాడేనండీ! గంగమ్మ కొడుకు! చిన్నతనంలో వాళ్ళనాయన గంగం పోయాడు. తరువాత గంగమ్మ కొడుకుని తీసుకొని ఇటువైపు వచ్చేసింది. మావూళ్ళో ఉన్నప్పుడు మా యింటిపక్కనే ఉండేవారు. నేను చిన్నదాన్నయినా అప్పట్లో నన్నెరుగుదురువాళ్ళు"

సుబ్బయ్య ఆశ్చర్య పోయాడు.

ముందుగా భోగట్టా విన్న పోతన్న,

"సరేలెండి సుబ్బయ్యగారూ! భయపడకండి! నేనుండగా మీకేభయమూ లేదు" అన్నాడు తాజాగా.

జరిగినది తెలుసుకున్న వెంకటావ్రావు,

"గవరయ్యగాణ్ణి నరికిపారేసి నోటు తెస్తా" అన్నాడు.

విషయం విన్న అవధాని బూతులు తిట్టడం అయాక,

"నోటు ఇస్తేనేగాని బిల్లు పాసవ్వని రామారావుచేతనే చెప్పిస్తాలే! మరేం ఫర్వాలేదు. ఆఫీసులో ఆమాత్రం యూనిటీ ఇంకావుందిలే, in spite of RamasWami" అన్నాడు.

"గవరయ్య నన్ను బాగా ఎరిగివుండాలండీ. గంగమ్మ నన్నుచూస్తే ఎంతో ముచ్చటపడేది. రేపొద్దున్నే వెళ్ళి అంతా సెటిల్ చేసుకువస్తానుండండి." అన్నాది మనోరమ.

"అయ్యొయ్యొ! ఆడమనిషివి. నీ కెందుకు నా గురించి అంత శ్రమ"

అని సుబ్బయ్య ఆమెతో అనలేదు.

♦ ♦ ♦ ♦

ఆదివారం, సాయంకాలం.

ఆదివారం సాయంకాలం అయిదుగంటలకి పోతురాజుని పిల్చేడు గవరయ్య.

"పోతురాజూ! అయితే ఆనోటు వాడి కిచ్చేద్దాం"

"అదే మంచిదండి"

"పాపం! మావూరు పిల్లవచ్చి అడిగింది కూడాను"

"అవునండి"

"వాడిమీద మనసుతో ఉన్నట్టుంది పాపం"

"అవునండి"

"వాడు దొంగ వెధవని చెప్పినా విన్నాది కాదు"

"దానికి మనమేం చేస్తామండి"

"ఆ వెధవ దీన్ని కూడా ద్రోహం చెయ్యక మానడు"

"అవునండి"

"పాపం అమాయకురాలు"

"చిత్తం. అలాగే కనిపిస్తోంది"

"మా అమ్మకి ఎంతో ఇష్టంగా ఉండేది"

"అలాగాండి??"

"అవున్రా...పాపం దాన్ని కష్టపెట్టడం నా కిష్టంలేదు"

"చిత్తం"

"నోటవ్వనంటే నొచ్చుకొంటుంది. అయిదువందలూ కావలిస్తే తను తీర్చుకుంటానంది"

"వాడంటే బాగా మోజుగా ఉన్నటుందండి"

"అవున్రా! అప్పటికీ చెప్పేను, వాడికి పెళ్ళాం పిల్లలూ ఉన్నారని. చెప్పినా విన్నాది కాదు. ఆడదాని మనసుకి తలా తోకా లేదురా పోతురాజూ"

"చిత్తం అలాగే నండి"

"సరే! ఏదో ప్రాధేయపడ్డాది...సరే అనేశాను"

"చిత్తం"

"తరువాత చూసేవు కదూ......"

"చిత్తం"

"ఆ దగుల్బాజీ వెధవ..."

"పోతన్నాండీ?"

"ఆ! ఆ వెధవ మనకెదురు తిరిగేడు"

"అవున్లెండి! వాడిపని తరువాత చూడొచ్చులెండి"

"సరేలే! కాని ఇప్పుడు?"

"నోటు ఇచ్చేద్దామంటే"

అవధానిగా డోహాషు పేచీపెడుతున్నాడు."

"వాడు దేవాంతప్ముండా కొడుకండి"

"అయితే ఆనోటు వాడి మొహాన్న విసిరేదామా?"

"విసిరెయ్యండి! మొన్న రాత్రి జరిగిన అవమానం చాల్నండి వాడికి"

"వాడు దొంగవెధవకదూ?"

"అవునండీ'

"అవమానం బాగా జరిగింది. ఏం?"

"అవునండి"

"అయితే అది పట్టుకువెళ్ళి వాడి మొహాన్న విసిరికొట్టు"

"చిత్తం!"

పోతురాజు వెళ్ళేడు.

వాలుకుర్చీలో చేర్లబడి పడుకున్న గవరయ్య "అబ్బా" అంటూ కళ్ళు మూసుకున్నాడు.

అబ్బా! తలనొప్పిగా ఉంది!

బిల్లు! బిల్లు!

బిల్లుపాస్ కాకపోతే ఎలా?

అవధానిగాడు అడ్డొచ్చేడు.

నోటుకీ బిల్లుకీ లంకె పెట్టేడు.

అందరి కాళ్ళూ పట్టుకున్నాడు.

ఆ వెధవ సుబ్బయ్య వెధవ!

ఎంత ద్రోహి! ఎంత ద్రోహి!

ఛీ! ఎవడికీ విశ్వాసం లేదే!

ఆపదలో యిచ్చేను అయిదువందలు.

కానీ యివ్వలేదే అందులో తిరిగి.

అవధానిగాడు అనవసరంగా ఆ వెధవ పక్షాన్న పూనుకొని వచ్చేడు గాని లేకపోతే వెధవని హత మార్చేద్దును.

వెంకటరావుగాడు ఎంతమందితో ఏంవని అరుచుకున్నా సరే! నాకు లక్ష్యంలేదు. నిజంగా?

పోనీ! పోతేపోయింది!

అప్పటి సంగతులు ఇప్పు డెందుకు?

వెంకట్రావుగాడు చెప్పినా ఎవరికీ తెలీదు.

ఎవరిక్కావాలా వెధవ పాత ఊసు.

కాని ఇప్పుడు, ఇప్పుడు, ఇప్పుడాపోతన్నగాడి పని పట్టించాలి.

విశ్వాస ఘాతకుడు!

ఆ సుబ్బయ్యగాడికీ వీడికీ ఉన్న చుట్టరికం ఏమిటో?

వాడో విశ్వాస ఘాతకుడు! వీడో విశ్వాసఘాతకుడు.

ఈ వెధవకూడా బ్లాక్ మార్కెట్టని పేల్తమే!

నమ్మి నాగుట్టు ఇవ్వడం తప్పయింది.

నమ్మక స్వామి ద్రోహం చేసేవాణ్ణి

ఏంచేస్తే పాపముంది!?

అబ్బా! తలనొప్పి!

ఎన్నడూ లేన్ది ఇవాళ తలనొప్పి ఎలా వచ్చింది? పోతన్న, అవధాని, బిల్సు, బ్లాక్ మార్కెట్ ఇవేనా నా తలనొప్పికి కారణాలు?

కావే!

ఆరోజు బీచిని కూర్చున్నప్పుడు ఇలాగే తలనొప్పి!

ఏరోజున?

అయ్యయ్యో! మర్చిపోయా ననుకున్నాను! జరిగిన దేదో జరిగిపోయింది. గతం గతించింది.

జరిగిన దేదో జరిగిపోయి, గతం గతించి పోయింది.

అంతా జరిగినదంతా పూర్తిగా చచ్చిందను కున్నాను.

"గతం" చచ్చిం దనుకున్నాను.

కాని బతికేవుంది.

నన్ను చంపుకుతింటోంది.

అబ్బా! తలనొప్పి!

హాబ్బా! రామ...చంద్రా! తలనొప్పి!

కారులో నా మోటారుకారులో నేను వెళ్తూవుంటే ఆపినదెవరు? పొద్దుటు నన్నాపిన దెవరు?

ఓహో! వెంకటాద్రివా?

ఎందు కాపేను వీను.

నన్నా నా కారునీ?

ఈ వెధవకి ఎడంగా నిల్చున్న ఆడమనిషెవరు?

మనిషి చాలా బావుందే!

"ఎవరో ఎరుగుదువా?"

అబ్బా! తల వేడిగా ఉంది!

అమ్మా! తల భారంగా ఉంది!

"ఎవరో ఎరుగుదువా?"

ఎరుగుదు నెరుగుదు నెరుగుదు నెరుగుదు నెరుగుదు.... .....

తెలుసు. తెలుసు. తెలుసు. నాకు తెలుసు.

హాబ్బబ్బా! శ్రీరామచంద్రా!

రామ స్యామ్మా! రామస్యామ్మా!

నాపాలిట భాగ్యలక్ష్మి!

నన్ను పట్టుకున్న పిశాచమా!

హాబ్బబ్బా నొప్పి! నొప్పి!

రామా రామా ఎంత బాధ ఎంతబాధ!

నన్ను చంపి చచ్చిపోయిన రామయ్యమ్మ!

నన్ను రాక్షసుడిగా మార్చిన రామయ్యమ్మ!

నన్ను స్వర్గంలోకి తీసుకుపోయిన రామయ్యమ్మ!

నన్ను నరకంలోకి దిగద్రోసిన రామయ్యమ్మ!

ఎరక్కేమిా? ఎరుగుకు వెరుగుదుగ!

ఎక్కుంది? ఎక్కడుంది?

వాడు, ఆ నీచుడు, ఆ తామసుడు. ఆ అడివి జంతువు,

ఆ నిర్భాగ్యుడు వెంకట్రావుగాడిదగ్గరా !!

"... ఎవరికీ తెలియదు... నోటుఇచ్చేస్తే ఎవరికీ తెలియదు..."

వెంకట్రావుగాడి పేలాపన! వెధవ్వెధవ జమిాందార్ల వంశంట! వెధవ్వంశం!

చూస్తే ఇదీ బ్రతుకు!

నేనా భయపడేవాణ్ణి!

అవధానే ఉద్దరాకపోతే,

సుబ్బయ్యగాడికి, వెంకట్రావు వ్వెధవగాడికి ఇలాంటి వెధవలందరికీ చూపిద్దును నా తడాఖా!

హబ్బా బాధ పోలేదే ఇంకా!

పాడుగుండె ఎలాపోతే నాకేం?

అలా అయితే నాకెందు కింత బాధ?

గుండెల్లో నొప్పి! గుండెల్లో మంట!

ఎందు కింతబాధ? ఎందు కీబాధ!



"ఫో ఫో! గెటవుట్! కారుపోనీరా డ్రైవర్!"

అనేశాను. అనేశాను.

కాని ఈ గవరయ్యకి ఇప్పుడెందు కింత బాధ?

పొద్దున్న ఏదో జరిగింది.

వెంకట్రావుగాడు అప్పుడే పోయేడు.

వాడివెనక...

నా కెందు కీబాధ?
బీచిని
చీకట్లో
ఆరాత్రి
బాధ! బాధ!
నెత్తి మొత్తుకొంటూ పోయింది.
పాపు ముండ! వెధవముండ!
చంపెయ్యవలసింది! తప్పుచేశాను!
ఎందు కీనొప్పి, ఈమంట ఈబాధ?
అయ్యో! అయ్యయ్యో!
రామయ్యమ్మ వెళిపోయిందే
వెళిపోయిందే నా జీవితంలోంచి!
నా బతుకంతా మాడ్చి మసిచేసి, ధ్వంసంచేసి నన్నుమార్చి, నన్ను చంపి, నన్ను పాతిపెట్టి ఆరాత్రే వెళిపోయిందే!
"అమ్మలు చక్కటి చుక్కరా గవరయ్య బాబూ!"
అమ్మలు అమ్మలూ అనేది రామయ్యమ్మని
ఎవరు? అమ్మ!!
చక్కటి చుక్కల్లే అమ్మా! నిజమే!
కాని ఎంతపనిచేసిందే! అమ్మా!
అమ్మా ఎక్కడే ఉన్నావ్?
నువ్వంటే అమ్మలుకూడా ఉండునే!
నన్నెందుకు విడిచి పెట్టేవమ్మా!
అమ్మా అమ్మలూ ఇద్దరూ లేరే!
నా జీవితంలోంచి ఇద్దరూ వెళిపోయేరే!
హాయ్యో! ఎంత బాధగా ఉందయ్యా నాకు
రామయ్యమ్మా! రామయ్యమ్మా!

మళ్ళీ ఎందుకొచ్చేవు?
పాతగవరయ్య ఆరోజే పోయేడు నీతో.
మళ్ళీ ఎందుకు బ్రతికిస్తావ్ వాణ్ణి!
రామయ్యమ్మా! వేగిరంగా పో!
నాకు బాధగా ఉంది.
నన్ను తిరిగి చంపకు.
నన్ను పొడిచి చంపకు
పొడిచి పొడిచి నన్ను తిరిగి చంపకు.
పో పో వెళిపో వెళిపో!
హాబ్బా! శ్రీరామచంద్రా!
ఏమి తల నొప్పిగా ఉందయ్యా!
నా తలనొప్పి తీర్చేందుకు
ఎవరున్నా రిక్కడ?
ఎవరూ లేరా?
అయ్యొయ్యో! ఎంత దిక్కు మాలిపోయేను!
అమ్మా అమ్మా! ఎంత దిక్కుమాలి పోయేనో చూడు!
నొప్పి! నొప్పి! నాకు తలనొప్పిగాఉంది!
నుదుటమీద చెయ్యి పెట్టుకొని కళ్ళు మూసుకున్నాడు గవరయ్య.
సాయంకాలం అయింది.
చీకటి మూసుకు వచ్చింది.
రాత్రి మళ్ళీ వచ్చింది.

---

# 12

ప్రోనోటు ఇచ్చేసి ఆ వెంటనే వెళ్ళిపోయాడు పోతురాజు. మడత పెట్టిన కాయితాన్ని వణుకుతూన్న చేతుల్తో పుచ్చుకున్న సుబ్బయ్య కంపించే కాళ్ళతో వెళ్ళేడు వంటగదిలోకి.

వంట గదిలో మండుతూన్న పొయ్యిలో ప్రోనోటు భగ్గుమంది.

భగ్గుమని మంటనుండి, బూడిదగా మారింది.

అయిదు వందలు వెయ్యిగా మారి
వెయ్యీ పొయ్యిలో పడి
కాలి కాలి
మసిగా మసిగా
మారిపోయేయి!!
నా కష్టాలన్నీ తీరిపోయేయి
నా బాధలన్నీ ఎగిరిపోయేయి
కమలా కమలా
క్రిష్ణా క్రిష్ణా!
సావిత్రీ సావిత్రీ
అందరికీ అందరికీ
చాటించి చెప్పాలి.
వెంకట్రావేడీ ?
పోతన్న ఇంకా రాలేదే !
అవధాని రేపుకాని కనిపించడు.
మనోరమ ఇంటిదగ్గరే వుంటుంది!!
వెళ్ళాలి! అక్కడికి వెళ్ళాలి!
కాని—
ఇదంతా ఎలా జరిగింది?
ఇంత అద్భుతంగా ఇదంతా ఎలా జరిగింది?
ఈ చిక్కంతా ఇంత విచిత్రంగా ఎలా విడిచింది?

ఎలా జరిగిందో ఎలా విడిందో నాకు తెలుసు.
వెంకటాద్రివు, పోతన్న, అవధాని, మనోరమ
అంతా కలిసి నాకోసం
నాకోసం కష్టపడి
ఈ రీతిగ చేసేరు.
ఇదంతా సాధించేరు.
చిలకలా, ఆడదాన్లా సింగారించుకొని వీధిలోకి వచ్చేడు సుబ్బయ్య.
సాయంకాలం ఆరుగంటలయింది.
సుబ్బయ్య వీధిలోకి వచ్చేడు.
అదే సమయంలో సరిగ్గా అదే సమయంలో
ఎదటింటి మాస్టరుగారు వీధిలోకి వచ్చేరు—
అంటే —ఆయన్ని వీధిలోకి తీసుకు వచ్చేరు.
ఆదినం మధ్యాహ్నం టైఫాయిడ్ జ్వరం అతణ్ణి వదిలింది.
జ్వరం వదలగానే 'మరింక నే నెందు' కని ప్రాణం కూడా అతణ్ణి వదిలింది.

డాక్టరుగారు వచ్చివచ్చి
“ప్రిస్క్రైబ్” చేసిన మందులన్నీ మింగి మింగి బ్రతకాలని తంటాలుబడ్డ
ఎదటింటి మాస్టరుగారు
అయిదు ప్రాణాలనీ అకస్మాత్తుగా విడిచేరు.
మాస్టర్ గారి శవాన్ని వీధిలో పడేసేరు.
“శివశివా! మాస్టరుగారి సంగతే మర్చేను” అనుకున్నాడు సుబ్బయ్య
శవాన్ని తీసుకుపోతున్నారు.
నల్లటి కుండలో రాజుకుంటోన్న ఎర్రటి నిప్పుని పట్టుకొని
ఏడుపువల్ల ఎర్రగా ఎరుపెక్కిన కళ్ళతో
పదహారేళ్ళ కుర్రవాడు ముందు నడుస్తున్నాడు.
ముందుకి కాళ్ళు పెట్టిన మాస్టరుగారి శవం
పదహారేళ్ళ పిల్లవాడు దారి చూపించగా

అందరూ వెళ్ళవలసినచోటుకి వెళ్తోంది.

శివశివా! హరహరా!

అనుకొంటూన్న నేను

చకచకా చకచకా

ఎక్కడకి వెళ్తున్నాను? ఎక్కడకి?

నా భార్యకాని పరాయి ఆడమనిషి దగ్గరకా?

వెళ్తేతప్పేముంది?

నాకు సహాయం, ఎవరూ చేయలేని సహాయం, ఎందుకూపనికిరాని నాకోసం, ఎంతో దయతో చేసిందే!

ఆమెకి ఆజన్మాంతం కృతజ్ఞుణ్ణిగా ఉండాలే!

నాభార్యకాని ఆడమనిషి నే సాకుతో, నెపంతో, వెనక్కి వెళ్ళిపోనా?

ఈశ్వరా! సర్వేశ్వరా! విశ్వేశ్వరా! హరహరా!

ఎంత దయామయుడివయ్యా!

నా బాధలన్నీ హరించేవే!

మాస్టర్ గారి బాధలన్నీ హరించేవే!

మాస్టర్ గారి బాధలన్నీ ఇవాళతో తీరిపోతే ఇంట్లో అంతా ఎందుకేడ్చేరు?

అయిదువందలబాధ తీరిందని నేనే సంతోషిస్తూ ఉండగా

అన్ని బాధలూ తీరిన మాస్టరుగారి ప్రాణం ఎంత సంతోషిస్తోందో!

వీళ్ళందరికీ ఏం తెలుసు?

జల్దీ జల్దీ! జోర్ జోర్! క్విక్ క్విక్!

మనోరమ నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది.

మాస్టరుగారికోసం ఎవ రెదురు చూస్తూ ఉంటారు?

ఛఛా! ఏమిటి ఇటువంటి చెడ్డ ఆలోచనలన్నీ నాకు!

మనోరమదగ్గరకి వేగిరం పోతే—

మనోరమకి ఎందుకు ఇంత అభిమానం నామీద!

గవరయ్య దగ్గరకి నాకోసం వెళ్ళిందా?

వెళ్ళేవుంటుంది! లేకపోతే నోటు ఇంటికెలా వస్తుంది?
వెళ్ళాలి వెళ్ళాలి వేగిరం వెళ్ళాలి
"మాస్టరుగారి శవం" డాక్టరుగారు భాషలో చెప్పినట్టు
"has turned the Corner!"
మాస్టరుగారి శవం సందు మళ్ళింది:
ఈశ్వరా! పరమేశ్వరా! రక్షించు రక్షించు!
దేవా! జగన్నాధా రక్షించు రక్షించు!
అన్నట్టు నాది పూరీ ప్రయాణం ఉంది! వీలు చూసుకొని వేగిరం వెళ్ళాలి.
ఎడంవైపుకి తిరిగింది మాస్టరుగారి శవం.
కుడివైపుకి తిరిగిన సుబ్బయ్య కిల్లీ కొట్టుదగ్గర ఆగేడు.
ఏదయ్యా! కత్తెర మార్కు పెట్టె?"
"ఇగ్గిపెట్టెకూడా ఇయ్యి!"
పహిల్వాన్ సత్తెయ్య ఫోటోకీ, నేషనల్ లీడర్ నెహ్రూ చిత్రానికీ మధ్యవుండే గడియారంలో
ఆరుంపావయింది.
సిగరెట్టు కాలుస్తూ నడుస్తూన్న సుబ్బయ్య ఆలోచిస్తూ అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాడు.
నాకేమీ అర్థం కావడంలేదు.
మబ్బు వేసింది.
మబ్బు విడింది.
ఎందుకు వేసింది?
ఎందుకు విడింది?
నాకేమీ అర్థం కావటంలేదు.
ఆలోచిస్తూ అన్నివైపులా చూస్తూనే ఆలోచిస్తూ నడుస్తున్నాడు సుబ్బయ్య.

స్టూడెంట్సు గుంపులు గుంపులు నడుస్తున్నారు. స్టూడెంట్సు కాని వాళ్ళు గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. షాపుల్లో దీపాలు వెలుగుతున్నాయి. షాపులబైట దీపాలు వెలుగుతున్నాయి. ఫలానా నంబరు బీడీనే కాల్చమని కేకలు వేస్తూ పద్దెనిమిదిమంది పిన్నాపెద్దా ప్రొసెషన్‌లో వెళ్తున్నారు. నలుగురు అందమైన ఆడవాళ్ళని ఆరుగురు అందంలేని మొగవాళ్ళు వెంబడిస్తున్నారు. పొట్టిగా ఉండే పంతులుగారికి చెరోపక్కా పొడవుగా ఉండే ఇద్దరు బోడి ముండలు నడుస్తున్నారు. మఫ్టీలో ఉన్న పోలీస్ ఇన్‌స్పెక్టరు షాపులోకి వెళ్ళబోతూ కాలుజారి కాలవలో పడ్డాడు. అది చూసిన వాళ్ళు చాలామంది నవ్వేరు. పడ్డవాడు పోలీసువాడని తెలిసిన దుకాణదారుడు నవ్వలేదు. నల్లకోటు వేసుకొని ముసిలిప్లీడరు నడవలేక నడుస్తున్నాడు. పడుచు ప్లీడరు నడవగలిగి రిక్షాలో వెళ్తున్నాడు. నిక్కర్లో బనియన్ టక్ చేసుకొని — ఇంటిదగ్గర పడుచు పెళ్ళాంగల పడుచు డాక్టరు — టెన్నిస్ బేటు చంకని పెట్టుకొని ఎవ్వరివైపూ చూడకుండా మూతి బిగించి నడుస్తున్నాడు. ఆ డాక్టర్ని తను బాగా ఎరుగుదునని ఆవీధిలో ఎవడో ఒకడు అనేవుంటాడు కళ్ళల్లో కామం పెట్టుకున్నవాడు సాని వీధి ఎక్కడుందో ఎరక్క ఎవర్నీ అడగలేక బాధపడుతున్నాడు. "ధర్మాసుపత్రికి దారేదయ్యా" అని ఒకనాటు రకం ఒరియావాణ్ణి ఒకనాటు రకం తెలుగు వాడ అడిగేడు. రోడ్డుమీద న్యూస్ పేపరు చదివేవాణ్ణి నూనె డబ్బా నెత్తిని పెట్టుకువస్తూన్న వయసు మళ్ళిన ఆడమనిషి గుద్దేసి పడిపోయింది. సారా తాగిన ఇద్దరు పెద్ద మనుష్యులు సారా తాగని అనేకమంది పెద్ద మనుష్యుల్ని పచ్చిబూతులు తిడుతున్నారు. కొత్తగా రెండో పెళ్ళి చేసుకున్న ఆడమనిషిని ఆమె మొట్టమొదటి ప్రియుడు పలకరించేడు; పక్కనే రెండవ పెనిమిటి ఉన్నాడని ఎరక్క. కాబూలీవాణ్ణి తప్పించుకుందికి జేబులో సరిగ్గా రెండణాలతో కాఫీహోటేల్లోకి దూరేడు లినెన్ షర్టు వేసుకున్న రెయిల్వే ఉంప్లాయీ. "సింక్లైర్ రీగాణ్ణిచూస్తే నాకసహ్యం" అని చెముడులేని స్నేహితుడితో ఒకడు గట్టిగా చెప్పేడు. చెప్పినా అతని వైపు ఎవరూ చూడలేదు. మహాత్మా గాంధిగారి గురించి ఒకడు ఆలోచించు

అన్నాది నోట్లో నల్లసైపళ్ళుగల ఇరవయ్యేళ్ళ మనిషి.

ఈవిడే కాబోలు కల్యాణి!

ఈ మొకి ఎదురుగా వంటరిగా. ఈ గదిలో కూర్చోగలనా?

చచ్చే నన్నమాటే! కూర్చోలేను!

అయితే ఏంచేసేది?

"బీచ్ని లైట్హవుస్ దగ్గర కూర్చుంటాను. మనోరమని అక్కడకి రమ్మని చెప్పండీ దయచేసి"

"ఓ అలాగే చెప్తా !...... అయితే గదిలో కూర్చోరామీరు"

"ఊహు?"

"సరే అయితే చెప్తాలెండి మనోరమతో.........కాని...గదిలో కూర్చోబెట్టమని మరీ మరీ చెప్పిందండీ మనోరమ"

"ఫరవాలేదు లెండి బీచికి రమ్మనండి"

"సరే అయితే మీ ఇష్టం"

బిచీకి మెల్లిగా వెళ్ళేసరికి ఏడుగంటలు దాటింది.

వెన్నెల్లో సముద్రం మెరుస్తూంది.

వెన్నెల్లో సముద్రపు ఇసిక మెరుస్తోంది

దీపస్తంభంమీద దీపం మెరుస్తూ తిరుగుతోంది.

సుబ్బయ్య తెల్లగా, శుభ్రంగా పొడిగా, మెత్తగా ఉన్న ఇసకలో కూర్చున్నాడు.

సముద్రతీరాన్న చాలా చల్లగాఉంది.

సముద్రతీరాన్న ఎంతో హాయిగా ఉంది

దూరమూరంగా అనేకులు కూర్చున్నారు. మసక మసగ్గా, తెల తెల్లగా అగుపిస్తున్నారు!

మనోరమ వస్తుందా, రాదా?

ఎక్కడకి చెప్మా వెళ్ళిందని చెప్పింది, కల్యాణి?

ఎక్కడకి?

ఆ! ఆ! మాస్టరు చచ్చిపోయేడు కదూ. వాళ్ళ వాళ్ళని చూడ్డానికి వెళ్ళింది.

ఇంతే ఈ మనోరమ! ఛీ!

మేష్టరింట్లో అంతా ఏడుస్తూ కూర్చుంటే వాళ్ళని ఇప్పుడు చూడ్డం అంత ముఖ్యమా?

రేపు వెళ్ళకూడదా, మరోనాడు కూడదా!

పొద్దున్న ఏం జరిగిందో యేమిటో?

గవరయ్య ఏమన్నాడో ఏమిటో?

ఇటువంటి అతి ముఖ్యవిషయాల గురించి మాట్లాడుదామని నేవస్తే ఇంటిదగ్గర ఉండకుండా...

ఎన్ని ముఖ్య విషయాలున్నాయి? ఎన్నెన్ని ముఖ్యవిషయాలున్నాయి!

ముఖ్యం ముఖ్యం విషయం విషయం.

అన్నట్లు మర్చేపోయేను.

మొన్న నే కదూ మనోరమ అన్నాది?!

"మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి?" అన్నాది మొన్న.

ఏమిటో ఆ ముఖ్య విషయం?

నిన్న నాతో అదేమిటో ఎందుకు చెప్పలేదు?

నిన్నటి గొడవలో నేనా విషయం మర్చేను.

ఆమెకూడా ఆ గొడవలో నాలాగే మర్చిందా? మర్చిపోయివుండదు.

నిన్నటి గొడవలో చెప్పడం మంచిది కాదను కొని వుంటుంది.

ఇవాళ చెప్దాం అనుకొని వుంటుంది.

ఇవాళ ఆ మేష్టరు చచ్చిపోడం బట్టి

ఇంతవరకూ కలుసుకోడం తప్పింది ఇద్దరం.

ఏమిటో కాని నాకు భయంగావుంది.

ఎన్నడూ ఎరగని నాలాంటి వెధవకి ఒక్క రోజులో లొంగిపోయింది!

ఇలాగ ఎంతమందికో??

కొంటూ వెళ్తున్నాడు. మహిళా మందిరానికి వెళ్తూ ఒకావిడ "ఆడముం డకి దాని కెందుకో అంత గర్వం, దాని మొగుడుకే లేనప్పుడు" అని తనతో వస్తూన్న మహిళతో ఇంకొక మహిళాధమురాలి గురించి చెప్పింది. బట్టలు వేసుకోని పిచ్చివాడివైపు బనారసు చీర కట్టుకున్న తనభార్య చూసినందుకు ఒకడు ఎంతో బాధపడ్డాడు. ఆ సాయంకాలం ఎర్రచీర మనిషి ఎర్రచీరే కట్టుకొని సైకిల్ రిక్షాలో వెళ్తోంది.

నాకేమీ అర్థం కావటం లేదు.

ఏదైనా బోధపర్చుకోవాలంటే దాని కారణం తెలుసుకో అన్నాడు చిన్నప్పటి సైన్సు మాస్టరు.

ఈ జరిగిన దానికి కారణం ఏముంది ?

నేను గవరయ్యని అయిదువంద లడిగేను.

ఎందు కడిగేను?

వెంకట్రావు అడగమన్నాడు. సావిత్రి అడగ మనకుండా అడగమంది. అడక్కపోతే బావుండదేమోఅని నాకనిపించింది. అడగను అనడానికి మొహ మాట పడ్డాను. అడిగితే ఏం పోయిందనుకున్నాను, ఇంకా చాలా చాలా కారణాలబట్టి అడిగేను.

వెంకట్రావు ఎందు కడగమన్నాడు? సావిత్రి అడగమనకుండా ఎందు కడగమంది? అడక్కపోతే బావుండదేమో నని నాకెందుకనిపించింది? మొహ మాటం ఎందుకు పడ్డాను? అడిగితే ఏంపోయిందని ఎందు కనుకున్నాను?

వీటి కారణాలు! వాటి కారణాలు!

నే నిప్పుడు మనోరమ ఇంటికి ఎందుకు వెళ్తున్నాను?

కారణం చెప్పేసరికి తాతలు దిగివస్తారు.

మనోరమ ఇంటికి ఎలా వెళ్తున్నాను?

నడిచి వెళ్తున్నాను ?

నేను నడవడానికి నడవగలగడానికి కారణాలేమిటి?

నా పుట్టు పూర్వోత్తరాలన్నీ చెప్పకురావాలి!

నా పుటు పూర్వోత్తర మంతా నాకే తెలియదే!

తెలిసినా చెప్పేదానికి బ్రతుకే చాలదే!

నేను ఇప్పుడు ఎలా నడవగలుగుతున్నాను అనే చిన్న ప్రశ్నకి కారణం నేను చెప్పలేనన్నమాటే!

నాకు పిచ్చి ఎత్తేటట్లుంది!

అలా ఉండడానికి కారణం?

కారణం ఏమిటి అని నే నడగడానికి కారణం?

నిజంగా నాకు పిచ్చెక్కుతుంది.

అంతా భగవంతుడి విలాసం.

అనేస్తే అతి సులభంగా అంతా తేలిపోయేదానికి

పిచ్చి తెచ్చిపెట్టుకోడ మెందుకు?

దేనికైనా కారణం చెప్పడం నీ తరమా నా తరమా?

ఎదటేంటి మాస్టరు నడివయసులో ఎందుకు చావాలి?

వాడెవడో ఇందాట్లా కాలవలో ఎందుకు పడాలి?

వాళ్ళెవరో సారా ఎందుకు తాగాలి? తాగి ఎందుకందర్నీ తిట్టాలి?

వాడురోడ్డుమీద న్యూస్ పేపరెందుకు చదవాలి?

వాళ్ళిద్దరూ బోడిముండ లెందుకవ్వాలి?

కారణం చెప్పడం నీతరమా నాతరమా!

"...తరంతం! ఇంటా బయటా జంట శివులవలె..."

వెళ్ళాలి! వేగిరం వెళ్ళాలి! నేనూ మనోరమా జంటగా బీచికి వెళ్ళాలి.

మనోరమ ఇంటిదగ్గరే ఉంటుందా?

ఉంటే ఉండడాని క్కారణమేమిటి? లేకపోతే లేకుండా ఉండడాని క్కారణమేమిటి?

అనుకొంటూ అతను వెళ్ళేసరికి మనోరమ ఇంటిదగ్గర లేదు.

గది తాళం వేసివుంది.

"ఎవరో మాస్టర్ గారు చచ్చిపోయారటండీ. భోగట్టా ఇప్పుడే తెలిసి బయల్దేరి వెళ్ళింది. మీరు వస్తే గదిలో కూర్చోమంది తాళం నాచేతికిచ్చింది. ఇప్పుడే వచ్చేస్తుందట"

అయినా పాపం ఇవాళ గవరయ్య దగ్గిరకి వెళ్ళి......

నా కోసం అలా తంటాలు పడుతుందా నామీద నిజమైన అభిమానం లేకపోతే?

నన్నింకా గట్టిగా బంధించడానికి ఇవీ ఒహ ఎత్తేమో......

నీ కంత ఉపకారం చేసేను,

నీకే అప్పగించేను నా గళ్ళంతా

ఇహ నామాట ఏం చెప్పు

ఇవాళ వచ్చి ఏమనుకుందో ఏమో?? వచ్చి పీకలమీద కూర్చుందంటే చస్తాను. అమాంతంగా చస్తాను.

పెళ్ళి చేసుకోమంటుందో?! భరణమే ఇమ్మంటుందో?!

మొన్న నేనకపోయి గదిలోకి వెళ్ళేను.

కల్యాణి చూసింది కూడా!

వెధ వ్యాళ్ళు కట్టుకోలేక పోయేను!!!

ఇప్పుడెప్పుడు గుర్తుకి వస్తోంది.

నెల తప్పిన మనిషిలా అవుపించిందా?

లేదు లేదు ఆమాట సర్వాబద్ధం. కాని—

కీడెంచి మేలెంచ మన్నాడు.

ఎక్కడ లోసుగున్నా నామీద సులభంగా తోసెయ్యవచ్చు!

నేరకపోయి ఇరుక్కున్నాను ఈ లంపటంలో.

ఇహ వస్తుం దనుకుంటాను—!!

కల్యాణి చెప్తుంది కల్యాణి తప్పకుండా చెప్తుంది.

"మీ వారు లైట్ హావుస్ దగ్గర తీరిగ్గా కూర్చొన్నారమ్మా! వెళ్ళు! వేగిరం వెళ్ళు!" మొహం తప్పకుంటూ చెప్తుంది.

ఇక్కడ కూర్చుంటానని దాన్తో నేరక చెప్పేను—!!

మనోరమ తొందరగా వచ్చేస్తుంది—!

ఏముంది? ఇట్టే వచ్చేస్తుంది

వచ్చి బాధిస్తుంది. నాగొంతుకమీద కూర్చుంటుంది నన్ను చంపు

చుంది. చంపుకుతింటుంది

నాకు భయంగా ఉంది.

ఛీఛీ! పాడు బ్రతుకునాది!!

ఏదో బాధతో ఎప్పుడూ భయపడుతూనే ఉంటాను.

ఇంటికి పోదునా? ఇక్కడే ఉందునా?

మేష్టరు చావకపోతే ఈపాటికి నాపిక్కలమీదవచ్చి కూర్చొనే ఉండేది. బతికిపోయేను. మరింక ఇంకా ఇలా కూర్చోడమెందుకు? అది రాకుండా ఇంటికిపోతే నయం! ఏమో?

సముద్రపు కెరటాలు తెల్లగా విసుగుతున్నాయి.

తెల్లటి పొడి ఇసుక వరకూ రాబోయి రాలేక పోతున్నాయి. పిలక పట్టుకొని లాగినట్టు వాటి నెవరో వెనక్కి లాగుతున్నారు.

ఇంటికి వెళ్ళనా? ఇక్కడే ఉండనా?

నాలాగే అందరూ బాధపడతారా?

ఇంటికి వెళ్ళేదా? ఇక్కడే ఉండేదా?

ఉంటే ఒక బాధ ఉండకపోతే ఇంకొక బాధ.

బాధలు వస్తాయేమోననేబాధ.

హబ్బబ్బ! ఈ ఆలోచనల్తో. నాతల పాడవుతోంది.

పాడు సందేహాలు, పాడు బాధలు, పాడు ఆలోచనలు,

పాడుభయాలు

అన్నింటితో నా మనసు పాడవుతోంది.

నా మనసుకి విశ్రాంతి లేకుండా పోతోంది.

చల్లగా హాయిగా గాలివీస్తోంటే మెత్తటి ఇసికలో కూర్చొని వెచ్చగా మనోరమ పక్కన కూర్చోగా హాయిగా హాయ్ హాయ్‌గాఉండక

నా మనసంతా భయాల్తో బాధ పెట్టుకుంటున్నాను.

నాకు శాంతిలేకుండా చేసుకుంటున్నాను.

నాకు శాంతి లేదు.

నాకు విశ్రాంతి లేదు.

విశ్రాంతి తీసుకొందికి ఎక్కడికి పోయేది?
ఎక్కడకి పోగలను?
భయం దుఃఖం, విచారం, సంతోషం.
మనసుకి ఇవేవీ లేకుండా ఎలా ఉండడం?
ఎక్కడకి పోతే అలా ఉంటుంది?
ఎక్కడికి పోయినాసరే నీ మనసుకి నామనసుకి ఎవడిమనసుకైనాసరే శాంతి వుండాలి! శాంతి. వుండాలి! శాంతి.
శాంతి లేన్ది మనసుకి విశ్రాన్తి ఎక్కడిది?
లేదే! ఉండదే!
నా కిప్పుడు శాంతి లేదు. విశ్రాంతిలేదు.
ఏంచేస్తే శాంతి వస్తుంది?
ఏం చెయ్యకపోతే శాంతి కలుగుతుంది?
మనిషికి శాంతిలేదు. మనిషికి విశ్రాంతి లేదు.
పుట్టింది లగాయితు చచ్చేవరకూ
క్షణ క్షణం క్షణ క్షణం ప్రతి క్షణం
అలా కదుల్తూ కదుల్తూ తిరుగుతూ తిరుగుతూ కొట్టుకొంటూ కొట్టుకొంటూ బాధపడుతూ బాధపడుతూ
ఉంటూ ఉంటూ ఉండవలసిందే!
చచ్చేక అప్పుడేమైనా ఉండాలి శాంతి!
అంతవరకూ ఉండదు మరి.
అయితే చావడమే మంచిదా?
చావే మంచిదయినప్పుడు పుట్టుక ఎందుకు పుట్టించేడు భగవంతుడు?
అందర్నీ చావమని!!
చస్తే శాంతి వస్తుంది/...వస్తుందా?
ఏమో ఎవడెరుగును?
శాంతి! శాంతి!
శాంతి అంటే ఏమిటి? చెప్మా?

బాగుంది. ఈ ప్రశ్న బాగుంది.

శాంతి అంటే ఏమిటి?

నాకు తెలియదే!!!

శాంతి అంటే ఏమిటో తెలియకుండా అది లేదని బాధపడుతున్నానే!!

సుబ్బయ్యకి "శాంతి" అంటే ఏమిటో తెలియలేదు.

వెన్నెల రాత్రిలో సముద్రతీరాన్న తెల్లటి మెత్తటి ఇసుకలో కళ్ళు మూసుకొని పడుకొన్న సుబ్బయ్య, "శాంతి" అనే పదానికి అర్థం తెలియని సుబ్బయ్య, "ఇక్కడ ఉండేదా లేక మనోరమ రాకుండా ఇంటికి పోయేదా" అని తర్కిస్తూ తర్కిస్తూ, ఏదేదో తలపోస్తూ తలపోస్తూ ఏమేమో ఊహిస్తూ ఊహిస్తూ తెల్లటి ఇసికలో, సముద్రపు తీరాన్న, వెన్నెల రాత్రిలో కళ్ళు మూసుకొని పడుక్కునే వున్నాడు.

పది నిమిషాలయింది.

పది నిమిషాలయిందా?

అనుకొంటూ సుబ్బయ్య కదిలి, కదలించుకొని, లేచి, నిల్చున్నాడు.

సముద్రం కదలిపోతూనే ఉంది. వెన్నెల కరిగిపోతూనే ఉంది.

మనుష్యులు వచ్చి పోతూనే ఉన్నారు———

మనోరమ జాడ మాత్రం కనిపించలేదు.

రాదు కాబోలు మనోరమ

అని అనుకోడంతో సుబ్బయ్య మనసు చివుక్కుమంది.

ఇసుకలో నెమ్మదిగా నడుస్తున్నాడు.

ఆ కల్యాణి చెప్పిందో లేదో?

చెప్తే, మనోరమ ఇంకా రాదేం?

మేష్టరిగారింటి దగ్గర ఎంతసేపని కూర్చుంటుంది?

అక్కణ్ణించి ఇక్కడకి రాడానికి అట్టేసేపు పట్టదుకూడానే!

నేనొచ్చి ఎంతసేపయింది?

గంటయిందా? అరగంటేఅయిందా?

ఇంతసేపూ ఏంచేస్తున్నాను?

"ఇంత ప్రశ్నలు వేసుకొని వేసుకొని కాస్సేపు కళ్లు మూసుకొని లేచి"
ఇసకలో నడుస్తున్నాడు సుబ్బయ్య.
దగ్గరగా నడుస్తూ ఎవరో ఆడా మగా ఇద్దరు ఇసకలోకి దిగేరు.
వాడితో. పైవాడితో. మగాడితో దిగేది మనోరమ కాదు కద!!
సుబ్బయ్య కన్ను చెదిరింది.
సర్దుకొని చూ[illegible]రు.
కాదు. కాదు [illegible] మనోరమ కాదు.
అలా మగా[illegible] [illegible] మనోరమే అయితే...?!
అయితే [illegible] దుకూ ఆ గొడవంతానూ? ఆడ మనోరమ కాదు
కమూ!
ఆడ మనోరమ కాదు.
వా[illegible] సుబ్బయ్య కాదు.
వాళ్లిద్దరూ నవ్వేరు – వాడు గలగలా, ఆమె కిలకిలా.
కిసకిస నవ్వడం లేదు కద
అని ఆశ్చర్యంలో చూసేడు సుబ్బయ్య.
వాళ్లు నిశ్శబ్దంగా చకచకా పోతున్నారు.
వెన్నెల వాళ్లమీదే పడుతోంది.
గాలి వాళ్ళకే [illegible]సుకుతోంది.
కెరటాలు తలలెత్తి వాళ్ళనే చూస్తున్నాయి.
వాళ్ళు ఒడ్డు కసరోయి దగ్గరగా కూర్చున్నారు.
ఆ మొగ్గర మల్లెవాసన తప్పని వేస్తుంది.
ఆతనామె మత్తులో ఉండేటంటాడు.
వాళ్ళు చెప్పుకునేవి చిలక పలుకులయి తీగాలి.
చివుక్కుమంది సుబ్బయ్యమనసు మరోసారి.
"ఈ నా మనోరమ కాదా ఈవాళ?"
మనోరమ ఎవరు?
ఎవరైనప్పటికీ ఆమె నీదెలా అయింది?

ఆవిడ రాకుండానే, వచ్చినా ఆమెకి కనిపించకుండానే ఉడాయించేద్దామనుకున్నవాడికి ఆవిడిగురించి యోచనెందుకు?

అని అనుకొంటూ రోడ్డుగట్టు ఎక్కిన సుబ్బయ్యని ఒక్కసారిగా నిలవేసింది ఆమాట.

ఉడాయించడం !!

వస్తూపోతూన్న జనం వస్తూపోతూనే ఉన్నారు. బాగా పల్చబడ్డారు. పక్కనే రోడ్డు జంక్షన్ మీద మెరిసే ఊదావేషం, కంగె ఊదారంగు తుంచుముక్కలా ఉంది. దానికింద తెల్లటి కాయ ఊదారంగు పూసుకొంది; కాళ్ళుజామునక్కచ్చింది; చల్లగాలి వీస్తోంది. ఓ జీప్ కారు, గవర్నమెంటు వారిది, మనిషి లక్ష్యంలేనట్టుగా జరాజర జరజరా వెళ్ళిపోయింది. కొన్నిర్లో సోడాదుకాణంలో పెట్రోమాక్సు లైటు వెలుగులో, వేళ్లాడే అరటిపళ్ళ గెలా, కొంతువలు నొక్కేసిన సోడాబుడ్లూ, పేర్చిన సిగరెట్టు పెట్టెలూ కనిపిస్తున్నాయి. సారాబుడ్లుమాత్రం కనిపించడంలేదు. కనిపిస్తూన్న దుకాణదారుడు మాసీచుకొళ్ళో ఉన్నాడు. దుకాణం పక్కబల్లమీద భయంకరుడొకడు కూర్చొని మాట్లాడుతున్నాడు. అతగాడు సుబాహుడైఉండాలి.

గట్టుమీద నిలవేసుకుపోయిన సుబ్బయ్య పాతుకుపోయిన ప్రతిమలా కనిపిస్తున్నాడు.

ఉడాయించడం!!

ఎవరుడాయిస్తారు?

దొంగలు ఉడాయిస్తారు.

దగుల్బాజీలు ఉడాయిస్తారు.

గుండెవడగాళ్ళు ఉడాయిస్తారు

గుండెవడతో ముందుకి అడుగు వేసేడు సుబ్బయ్య ఎలాగైతేనేం.

కాని, అడుగెందుకు అంత నెమ్మదిగా పడుతోంది?

పాదానికి తిమ్మిరెక్కిందా? కీళ్ళకి నొప్పులొచ్చేయా?

దుకాణం దగ్గరికి వెళ్ళేసరికి గొంతు కెందుకు ఆర్చుకుపోయింది?

సుబ్బయ్య దుకాణం దగ్గరకి వెళ్లగానే "బాబుకో సోడాకొట్టా)

కూర్చోండా!" అని హుకుం జారీ చేసేడు దుకాణదారుడు.

సిగరెట్లు మాత్రం కొందామని వచ్చిన సుబ్బయ్య దుకాణదారుడి డైరెక్షన్ ప్రకారం సోడా కూడా తాగేక, సీసా ఇచ్చేసి, సిగరెట్లు పుచ్చుకొని, డబ్బులిచ్చేసి, కూలబడ్డాడు బల్లమీద భయంకరుడి పక్కన.

దూరంలో ఎవరో ఇసకలోకి దిగేరు.

మనోరమా?

కాదు కాదు.

కిందువా వేసుకున్నారు జుట్టు పెంచుకున్నారు.

కవిగారవాలి. కాకపోతే కొత్తగావచ్చిన డాన్సుమాస్టరవాలి.

నీరసంగా లేకపోయినా నిస్సత్తువగా నిరుత్సాహంగాఉంది, బల్లమీద కూర్చున్న సుబ్బయ్యకి.

అనతి దూరంనుంచి సముద్రం హోరెత్తి పాడుతోంది. పక్కనే కూర్చున్నవాడు కీమగొంతుకతో, దుకాణంవాడితో, నిషాతో ఎక్కడో జరిగిన గొడవ గురించి వివరాలు చెప్తూ చెప్పలేక పోతున్నాడు. కాస్త జాపాక్కూర్చున్న కారుమీద ఎవరో విలాసపురుషుడు చెయ్యివేసి నిలుచుతూ ఎవరికోసమో కాసుక్కూర్చున్నాడు.

మరెవరో కొంతదగ్గర్లో ఇసకలోకి దిగుతున్నారు.

ఎవరామె ఎవరు!?

చెదిరే ముంగురుల్ని సరిచేసుకోలేక పోతోంది ఆమె.

ఎగిరే బావుటాలాంటి పైటని సద్దుకోలేక పోతోందిఆమె

తొందరగా తొందరగా నడవలేక పోతోంది ఆయమ.

మనోరమా??

మనోరమే!!

ఏంచెయ్యాలో తోచడంలేదు సుబ్బయ్యకి.

లేచి నిల్చోబోయేడు.

లేచి నిలవలేక పోయేడు!

గుండెకాదు కొట్టుకొనేది.

పత్తికాయ.

నెత్తురుకాదు ప్రవహిస్తున్నది.

ఉప్పునీరు.

మనిషికాదు కూర్చున్నది.

వెదురుగొడ్డు.

ఎదురుచూస్తూ, సందేహిస్తూ, తబపటాయిస్తూ కూర్చున్నాడు సుబ్బయ్య.

మనోరమ నడుస్తోంది మెల్లిగా, భారంగా.

ఆమె తెల్లటి చీరమీద పడుతోంది వెలుగు చల్లగా, ఉదాగా.

వెన్నెల ఆమెమీద పడి చెదిరి పోతోంది చిందరగా వందరగా.

ఎగురుతోంది ఆమెపైటు మెరిసే బావుటాలా.

కనిపిస్తోందామె నడిచే వెలుగులా.

బల్లనించి లేద్దామనుకోలేదు సుబ్బయ్య. కాని మనిషిని కాళ్ళు నిలవేసేయి. గట్టుదాకా ఈడ్చుకువెళ్ళేయి.

మనోరమ అటుచూడలేదు. ఇటుచూడలేదు. అట్టేదూరం వెళ్ళలేదు. ఒడ్డున కూర్చుంది. ఏదో ఆలోచిస్తోంది

వెళ్ళనా మానా అనే అనుమానంతో గట్టుదగ్గర నిల్చుండిపోయిన వాడిపేరు సుబ్బయ్య

సుబ్బయ్యనే పేరుగల ఆసామీ వస్తాడారాడా అని అనుమానిస్తూ కూర్చున్నట్టుగా లేదు మనోరమ.

ఒస్తాడు. ఎందుకురాడు? రాకుండా ఎలాఉండగలడు? అన్నట్టుగా నిశ్చలంగా కూర్చుంది.

ఏదో విషయంగురించి తీవ్రంగా ఆలోచిస్తున్నట్టుగా మాత్రం కనిపిస్తోంది.

తీవ్రాతి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు సుబ్బయ్యకూడా.

రకరకాలుగా కొట్టుకుంటున్నాయి అతనిగుండెలు.

పరిపరి విధాలుగా పోతోంది అతని మనసు.

రోడ్డుపైన మెరిసే ఊదారంగు మంచుముక్కా, దుకాణంలో గుడ్డిగా వెలిగే పెట్రొమాక్సులైటూ, సోడాదుకాణం పెట్టి సారాసీసాలు దాచిన మారీచుడూ కారుకి కాళ్ళునిమిరే విలాసపురుషుడూ, ఎక్కడో జరిగిన గాడీ వెనకనుంచి వినిపించే కీచుగొంతుకా, ఏవీ ఎవరూకూడా సుబ్బయ్యమట్టుకి ఉన్నా లేనట్టే.

దేనిగురించి ఆలోచిస్తోంది మనోరమ?

అనే విషయంలోకి వచ్చింది సుబ్బయ్య ఆలోచన.

ముఖ్య విషయం!

ముఖ్యవిషయం గురించి ఆలోచిస్తోంది.

ఎటువంటిదా ముఖ్యవిషయం? ఏమిటా ముఖ్య విషయం?

ఏమిటో తెలీదు.

కాని, మిక్కిలి కష్టమైన విషయం.

ఈ ఆడమనిషి కష్టంలో ఉందని తెల్సుకోడానికి ఆట్టే కష్టంలేదు.

ఆ వంచిన వీపు చూస్తే తెలుస్తుంది.

ఆ వంచిన తల చూస్తే తెలుస్తుంది.

తెలీదా?

అనుమానం తీరకపోతే వెళ్ళి కనుక్కోవచ్చు.

చేతనైతే సాయం...

చేయవచ్చు

పైనుండిపడే వెన్నెల్లో వెనకనుంచివచ్చే పల్చటి ఊదారంగు వెలుగులో మనోరమ చిత్రంగా, కలలో కనిపించినట్టుగా కనిపిస్తోంది.

ఆమె ముందున్నది కదిలే సముద్రం, అందులో లేచేవి ఎత్తయిన కెరటాలు.

సుబ్బయ్య నిల్చున్న చోటునుంచి సముద్రంలో కెరటాలు లేవడమే కనిపిస్తోంది, కాని, ఆ కెరటాల నురుగులు కనిపించడంలేదు.

అందుచేత

తలవంచుకూర్చున్న మనోరమ మహాసముద్రంలో తేల్తున్నట్టనిపించింది సుబ్బయ్యకి.

ఈ సమయంలో ఈ సముద్రంలో ఈ ఆడమనిషిని...

సుబ్బయ్య మనసు పరిగెడుతోంది. ఆగుతోంది. గిరగిర తిరుగుతోంది. పరిగెడుతోంది.

డబ్బడుగుతుందేమో. తంటా తెస్తుందేమో. పీకలమీద సవారీ అవుతుందేమో...

పరిగెడుతోంది.

...మన పీకలమీదకేదీ రాకూడదు.

ఆగింది.

ఒక్కసారిగా ఆగింది.

అదీ సంగతి.

ముప్ఫయ్యేయిదేళ్లకీ మూలమాత్రం.

సేఫ్, సేఫర్, సేఫెస్ట్.

అందుకోసం —

అందరి దగ్గరా ఒదుగు.

నీడన్ని చూసి భయం.

అధికారం అంటే హడల్.

అందుకే పిల్లినడకలు, కప్పగంతులు, కళ్లమూతలు.

వాడేమనుకుంటాడో?! ఇదేమనుకుంటుందో?! ఈమె కోపం వస్తుందేమో?! వాడు మండిపడతాడేమో?! పీకలమీద కొస్తుందేమో?! ఉద్యోగం ఊడుతుందేమో?! లంపటం తగులుకొంటుందేమో?! అయినా ఈ గొడవ మనకెందుకు? ఈతంటాలు మనకేల?! నేలని పోయేది నెత్తికెందుకు? కడుపులోని చల్ల కదల్డం ఎందుకు!

ఇవీ పునాదులు!

అని స్పష్టంగా అనుకోలేదు సుబ్బయ్య.

కాని,

తీసిన గోతులూ, అందులో తను తీసుకున్న గోతులూ, అందులో తనూ —

అంతా అస్పష్టంగా చూడగలిగేడా వెన్నెల్లో సుబ్బయ్య.

ఎదుటకి చూస్తున్నాడు సుబ్బయ్యం.

కాని ఎదుటు చూడ్డం లేదు. సుబ్బయ్యం.

వెనక్కి కళ్ళు పెట్టుకు చూస్తున్నాడు.

శైశవం, బాల్యం, యౌవనం.

అంతా ఒక్కలాఉంది.

కనిపించేవన్నీ కలిగించినది ఒక్కటే అయింది.

సముద్రపొడ్డున "అమ్మో! రావణాసురుడి మీసాలు!" చీకటింట్లో పులికోరల సవిత్తల్లి; చీకటి బాటలో తండ్రి వంటిమీద కర్రల పెళపెళలు; ఊరవతల పాడుగుడిలో దయ్యాల జాడలనుకున్న బూజుల నీడలు; బళ్ళో తూళ్ళకర్రమీసాల మాస్టర్ల చేతుల్లో పేంబెత్తాలుకావు; పాంబెత్తాలు; ఈ నాడు ఇంట్లో నాయకురాలి దర్పం; ఆఫీసులో కుర్చీలు దిగని బధిరాంధక శవాలు; రాజశ్యాలకులు చుట్టాలు; బద్మాషులు బంధువులు; "అప్పలాళ్ళు" పావుకాల్ల యములాళ్ళు; వీధిలో పరాయి ప్రభుత్వపు పోలీసుల "ధూమ్రాక్ష ధూమకేతు" ముఖాలు;

కనిపించే ఈ అన్నింటినీ, ఈ అందర్నీ చూసి నిమిష నిమిషానికీ హడల్ హడల్.

అందరి దగ్గరా అనుక్షణం "దాసోహం, దాసోహం"

ఈక్షణంవరకూ అలా వెళ్ళింది జీవితం హీనంగా, నీచంగా, క్షుద్రంగా దౌర్భాగ్యంగా, దైన్యంగా.

ఆ చీకటి వెనక్కి పీకుతోంది.

ఈ వెలుగు ముందుకి లాగుతోంది.

పావుగంటయింది.

పావుగంట దాటింది.

సుబాహుడు గారడీ వృత్తాంతాన్ని దుకాణాన్ని విడిచేసి ఎక్కడికో పోయేడు. దుకాణదారుడు దుకాణానికి తాళాలు వేస్తూ గలగల శబ్దం చేస్తున్నాడు. ఊదా దీపపు వెలుగు తారోడ్డుమీద మంచులా పడుతోంది. నిశ్శబ్దంగా ఉన్న బీచిరోడ్డు నిర్జనంగా ఉండడంచేత మిక్కిలి విశాలంగా కనిపి

స్తోంది. మిక్కిలి నిశ్శబ్దంగా ఉంది. పైన చంద్రుడు చప్పుడు చెయ్యకుండా నవ్వుతున్నాడు. పక్కన సముద్రం విరామం లేకుండా పాడుతోంది.

కొంతసేపయాక ఒడ్డున కూర్చున్న మనోరమ తలెత్తి చూసి,

“వచ్చేశా! రండి కూర్చోండి” అంది.

తలెత్తినప్పుడు ఆమె ముఖంమీద వెన్నెలపడి మెరిసింది.

వెన్నెల్లో ఆమె కళ్ళు మిలమిల్లాడేయి.

ఆ వెన్నెల్లో ఆమె కన్నీళ్ళు కూడా మిలమిల్లాడేయి.

ఆమెకి దగ్గరగా కూర్చున్న సుబ్బయ్య ఆమె చుట్టూ చెయ్యివేసి ఆమె ముఖంలోకి చూసేడు.

ఆమె ఏదో ఆలోచిస్తూ నిశ్చలంగా చూస్తోంది ఎదుట కల్లోలంలోకి.

అప్రయత్నంగా చూసేడు సుబ్బయ్య కూడా అవైపు.

వెన్నెల్లో సముద్రం ఓసారి మిలమిల్లాడుతోంది. మరోసారి తళతళలాడుతోంది.

భీకరంగా ఉంది సముద్రం.

మనోహరంగా ఉంది సముద్రం.

సముద్రంలో కెరటాలు లేస్తూ లేస్తూనే ఉన్నాయి.

సముద్రం కదుల్తూ కదుల్తూనే ఉంది.

ఈ సముద్రం కదలకుండా ఎప్పుడుంది?!



193



## రాబోవు ప్రచురణలు:

శ్రీ బలివాడ కాంతరావు,

"కావడి కుండలు" (కథలు)

"బరాచీ" (చిన్న నవల)

శ్రీ కాళీపట్నపు రామారావు,

"రాగమయి" (కథలు)

శ్రీ అంగర వెంకట కృష్ణారావు,

"తుఫాను" (కథలు)

శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు, (కథలు)

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి, (కథలు)

 

# సౌరసాహితి

తెలుగు వారికి కావలసినన్ని రావలసిన పుస్తకాలు రాలేదు. అవి రావటానికి మేం నిరంతరం కృషిచేస్తాం.

అనునిత్యం అడుగడుగునా నేటి మనుష్యులకు ఎదురయే జీవిత సమస్యల పరిష్కారానికి సంస్కారపు వెలుగు లిస్తాయి మా సాహితీ కిరణాలు.

తెలుగు మనసుకు ఆరోగ్యమూ, వ్యాయామానికి బలమూ అందిస్తాయి.

---

అక్షరం నేర్చిన ఆంధ్రులందరికీ ఆనందమూ ఆత్మోన్నత్యమూ కలిగిస్తాయి.

ఉత్తమ సాహిత్య సృష్టిలో రచిస్తున్న నేటి రచయితలకూ, వివిధ రచనా ప్రక్రియలకూ రసికులగు పాఠకులతో సన్నిహిత సంబంధం కూర్చే ఉద్దేశంతో యీ గ్రంథమాల వ్యవహరిస్తుంది.

నెలకొక మంచి పుస్తకం పాఠకుల చేతుల్లో ఉంచుతుంది.

